# ‘ఇప్పుడు నా చురుకుతనాన్ని చూచి అందరూ ఆశ్చర్యపడుతున్నారు!’

కాని, కొన్ని నెలల క్రితము నీరసంతో నేను ఆఫీసు పని సరిగ్గా చేయ లేక పోయాను. చివరకి ఒక డాక్టర్ని సంప్రదించాను.

డాక్టరు ఇలా అన్నారు “మీకు కావలసినంత పోషణ లభించలేదు. హార్లిక్స్ త్రాగండి.”

హార్లిక్స్ త్వరలోనే నాకు శక్తి ఉత్సాహములను కలిగించింది. ఇప్పుడు నేను ఓపికతో చురుకుగా పని చేయడం చూచి అందరూ ఆశ్చర్యపడుతున్నారు!





## హార్లిక్స్ వాడడం వల్ల శక్తి ఉత్సాహాలతో వున్నాను!

సరైన పోషణ లేక పోవడం వల్ల కలిగే నీరసము, అలసట కొన్ని సమయాల్లో ఉద్యోగమునకే హాని కలిగించవచ్చు. వీటికి ప్రతివిధిగా డాక్టర్లు హార్లిక్స్ సిఫార్సు చేస్తారు. హార్లిక్స్ అదనపు పోషణత్వాన్ని యిచ్చి శక్తి ఉత్సాహము, మంచి ఆరోగ్యము కలుగచేస్తుంది.




# హార్లిక్స్ అదనపు శక్తిని కలిగించును!

HL 7486 A

గురించి 31—10—69 పత్రికలో శ్రీ మాగంటి రాధాకృష్ణమూర్తిగారు వెలుబుచ్చినట్లు కమల అలా వుత్తరం వ్రాయటం ఎబ్బెట్టుగా లేదు. ఎందుకంటే సామాన్యంగా స్త్రీలు కాన్పుకు పుట్టింటికి 7 వ మాసంలోగాని, 9 వ మాసంలోగాని వెళ్లేమాట నిజమైనా కాన్పు అయిన తరువాత కూడా కనీసం, నెలా, రెండు నెలలు పుట్టింట వుండటం జరుగు తుంది. కమల వుత్తరం వ్రాయడం గురించి రచయిత వ్రాసినది కాన్పుకు తరువాత అని భావించి చదివితే బహుశ ఎబ్బెట్టుగా వుండదనుకుంటాను.

జానకి, [విజయవాడ.

## సీరియల్

"పరివృత్తం" సీరియల్‌లో జయకు చాలా అన్యాయం జరిగిపోయింది. మార్గరెట్‌లో వున్న సంస్కారభావం సాంబశివంలో లోపించటం తర తరాలుగా ప్రేమీ— ప్రేమికులలో మగవాడు ప్రదర్శించే అసహనం, అహంభావాలే కారణమేమో? అసలు — అనుభవాలు మనం చూసే కామెడీ (సుఖాంతం) సినిమాల కథలాగ ఉంటున్నది. ముగింపును సులభంగా వూహించ వచ్చును. ఏమైనా, కథనంలో మటుకు కొంత క్రొత్తదనం, నేర్పు ఉన్నాయ్. రచయిత్రి యింక సినిమాలకు కథలు వ్రాయవచ్చును.

డి. కళ్యాణి, డి. చక్రవర్తి, [కాకినాడ.]

## వ్యాసాలు

31—10—69 సంచికలో శ్రీ పి. ఎ. వి. రాజు [బిలాస్‌పూర్] వ్రాసిన ఉత్తరం చదివినాను. అందులో వారు నాకు హిందీ భాషపై ద్వేషభావం ఉందంటూ వ్రాసినారు. నాకు ఏ భాషపైనా ద్వేష భావం లేదు. ఆనాడు జరిగిన ఒక నిజాన్ని మాత్రమే నేను వ్రాశాను. మాతృభాషలో నయినా ప్రసంగించమని కోరినారని వ్రాశారు. అధికార భాషగా ఉన్న ఇంగ్లీషులో ఎందుకు ప్రసంగించరాదో తెలియజేస్తే సంతోషిస్తాను. తెలిసీ తెలియని వివరాలతో జనసంఘమువారిని అపనిందపాలు జేయడమనే ఉద్దేశ్యం లేదు. ఆ పార్టీపేరు 'అఖిల భారతీయ జనసంఘము'. అయినప్పుడు భారతీయులందరినీ సమానముగా చూడాలి. అంటే అన్ని భాషలవారిని గౌరవించాలన్నమాట. నేను తెలుగువాడిని నాకు హిందీ రాదు. ఇంగ్లీషు వచ్చు. ఒక హిందీ వ్యక్తికి ఇంగ్లీషు వచ్చు. తెలుగు రాదు. అప్పుడు మేము ఏ భాషలో మాట్లాడు కుంటాము, ఇంగ్లీషులోనే కదా! అలాగే పార్లమెంటులో అనేక భాషలవారున్నారు. అందరికీ తెలుగు రాదు. చాలామందికి ఇంగ్లీషు వచ్చు. అందుచేత వారు ఇంగ్లీషులో ప్రసంగించడములో తప్పేమిటి? అప్పుడు వారి ఉపన్యాసాన్ని వీరు గౌరవించ లేదు. తెలుగువారికి తెలుగు భాష మీద గౌరవం ఉంది. అభిమాన ముంది. కాని హిందీవారివలె మాతృ భాషా దురభిమానం లేదని గమనించ గలరు.

కందికొండ చంద్రమౌళి ప్రసాదరావు
[పి. అగ్రహారం]

* * *

# ఉత్తరాలు

సంపాదకవర్యా! మేము మీ దసరా ప్రత్యేక సంచికను కొని నిరుత్సాహమే కాక క్రోధితులను చేయు 'ప్రశ్నావళి' అను పేర ప్రకటించిన అంశమును చూచితిమి. అది తెలంగాణా పౌరులను, ఉద్యమకారులను అవమానించునట్టిదిగా యున్నది. కొందరు ఆంధ్రులు తెలంగాణ గూర్చి చిలువల పలువలుగా చేసి ప్రచారము చేయుచున్నారు. దానికి నిదర్శనము మీ ప్రచురణమే. మీరు తెలంగాణాను గూర్చి వ్రాసిన వానిని ప్రచురించుటమాని, ఇట్టి ప్రచురణలు ప్రచురించినందులకుగాను క్షమాపణలు చెప్పక తప్పదు. ఇది మీ పత్రికకు శ్రేయదాయకము. మీపత్రికలు అగ్నిహోత్రునకు ఆహుతికాకుండ కాపాడుకొనుటకు ఏకైకమార్గము.

'జాగ్రత'— శలవు.
వీరతెలంగాణా పౌరుడు.
[చిరునామా లేదు— సం.]

* * *

ఆర్యా, 'ఉన్నత విద్యాసంస్థలు కొరవడిన ఆంధ్రప్రదేశ్' అను వ్యాసమును ప్రచురించిన మీరు, వ్యాసకర్త అభినందనీయులు. వాస్తవాలను చక్కగా వెలువరించినారు. కాని పదవులకు మాత్రమే కుమ్ములాడే, ఈ బడా నాయకులకు ఇవి ఆలోచించే వ్యవధి లేకపోయినా, ఇటువంటి మంచి సలహాలను, అభినందించి, అనుసరించే విశాల హృదయములు కలవారు కారుగదా! ఆంధ్రదేశము బాగుపడుతుంటే చూడగల 'అంతరాత్మ' వారికున్నదా?

విద్యా రంగంలో సహా, అన్నింటిలోను, రాజకీయ కుతంత్రాలతో నిండిఉన్న ఈ రోజులలో, తెలుగు దేశము, జనులు చదివి ఇక్కడే ఉంటే, వారి పదవులకు హానియని తెలుసుకున్న ఘనులు కదా!

తమ పదవులు పోయినా, తమ వారసులు ఉండాలని, సృష్టించిన విశ్వవిద్యాలయము, తత్సంబంధ అనుబంధ కళాశాలలే గాని, ప్రజల అవసరార్థం చేసినవి కావని లోకవిదితమే.

ఇంక తెలుగు సోదరులకు ఆ 'తిరుమలేశుడు' దిక్కు. అయినా ఆ వేంకటరమణుడే, ఇప్పుడు రాజకీయ పెద్దలకు దాసానుదాసుడై, వారి కొలువులో ఉంటే, ఆ 'దేవునికి' 'విముక్తి', ఈ 'దీనులకు' 'ముక్తి' ఎప్పుడో!

భాస — బాల, [హైదరాబాదు]

* * *

దసరాసంచికలో "ముద్దు"పై తన అభిప్రాయాన్ని నిర్మోహమాటంగాను, వాస్తవికంగాను, ఇతర తారలవలె కాక, నిరాడంబరంగాను వ్యక్తపరచిన విజయలలితను అభినందిస్తున్నాను. ఇకపోతే "ముద్దు [తెరపై]" మన సాంప్రదాయానికి, సంస్కృతికి విరుద్ధం" అని చెప్పిన తారలంతా తమ వాగ్దానాన్ని ఎంతవరకు నిలబెట్టుకుంటారో వేచి చూడవలసివుంది. పాఠకులు ఈ విషయాన్ని గుర్తుంచుకో గోర్తాను.

కె. ఎల్. రాజు (లక్నో).


# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు:
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

శుక్రవారం: 21—11—'69
శ్రీ సౌమ్యనామ సం॥ కార్తీక మా॥ శుద్ధ త్రయోదశి
సంపుటము: 63 సంచిక: 10

స్థాపితము:
1908

ముఖ్య సంపాదకుడు:
శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు:
శివలెంక రాధాకృష్ణ

ఆంధ్రపత్రిక కార్యాలయము
1, తంబుచెట్టి వీథి, మద్రాసు-1

పోస్టుద్వారా

| | |
|---|---|
| సంవత్సర చందా | 26.00 |
| 6 మాసముల చందా | 13.00 |
| 3 మాసముల చందా | 6.50 |


## విషయానుక్రమణిక



నువ్వే చేశావు
నువ్వే చేశావు
విఫల సంభాషణ
ఇందిర పక్షం చేరు నీకు ఫలితం వుంటుంది
వారు నన్ను బందీని చేశారా!
కమ్యూనిస్టు పంజరం

# భారతదేశాన్ని ఎదుర్కొంటున్న ప్రమాదాలు

భారతదేశం దద్దరిల్లిపోయిందనవచ్చు: తుఫాను ఆగిపోలేదు కాని దాని భీభత్సం తగ్గింది. ఈ అలజడి వల్ల కలిగిన హాని భారతదేశానికి రథాత్‌వల్ల కూడా కలగలేదనవచ్చు; ఎందుచేతనంటే, కాంగ్రెసు పార్టీలో కొట్లాటలు జరిగే కాలంలోనే రాజధానిలోనే ప్రపంచం అంతటి నుంచి సుమారు నూట ఏభయిమంది విదేశీయులు హాజరయిన 'పార్లమెంటరీ' సమావేశం ఒకటి జరిగింది.

ఈ సభలో భారతదేశం పేరు ఎంతమాత్రం నిలబడింది, అంటే అక్కడా మనదేశం అపహాస్యానికి పాలయినదని చెప్పాలి. భారతదేశం తరఫున ఈ సమావేశానికి వెళ్లినవారు శ్రీ ఆర్. కె. ఖడిల్కర్. వారు ఇంతకుముందు లోక్‌సభకి డిప్యూటీ స్పీకర్; ఇటీవలే స్టేట్ స్థాయి మంత్రిఅయ్యారు. ('సప్లయి' శాఖకి). వారు, ఈజిప్టు తో కలిసి సమావేశం కార్యదర్శి నివేదికని దూషించారు. వీరికి మద్దతు చేకూర్చినవారు కమ్యూనిస్టు నాయకులు శ్రీ భూపేష్ గుప్త. ఈ దూషణని విన్న బ్రిటిషు, అమెరికన్ ప్రతినిధులు, కార్యదర్శి అందరినీ సంతోషపెట్టడానికి ప్రయత్నిస్తే అసలు నివేదిక అనేదే ఉండదన్నారు. "సభికులు లేని సభలో తెల్ల కాగితాన్ని సమర్పించవలసి ఉంటుం" దన్నారు.

## కాంగ్రెసు వ్యవహారాలు

ఇదంతా ఇలా ఉంచండి—మన పరిస్థితిని ప్రత్యేకంగా చాటేందుకు ప్రచారం వేరే అవసరం లేదు. మన దేశంలోని కాంగ్రెసు పార్టీ వ్యవహారాలే కావలసినంత ప్రచారాన్ని చేసిపెడుతున్నాయి. పైన చెప్పిన అంతర్జాతీయ పార్లమెంటరీ యూనియన్ సమావేశంలో పాల్గొన్న ప్రతినిధులు మన దేశంలో జరిగిన వాటిని కొన్నిటిని ప్రత్యక్షంగా చూశారు. అంతేకాక, భారతీయ వార్తాపత్రికలని తమతో తీసుకు వెడుతున్నారు. కాంగ్రెసులో చీలికలని అర్థం చేసుకోవాలంటే బెంగుళూరు సమావేశం కన్నా వెనక్కి వెళ్లాలి. కాంగ్రెసుపార్టీలో ఇష్టాయిష్టాలని గురించిన గుసగుసలు ఎన్నో వినిపిస్తూనే వచ్చాయి. మొదట రాయి విసిరింది 'సిండికేట్' వర్గమే. ప్రధానమంత్రి కోరినట్లు రాష్ట్రపతి ప్రత్యర్థి ఎన్నికని మరొక పక్షం రోజులు వాయిదా వేసి ఉంటే ఏమీ మునిగి పోయేది కాదు. రాయి వేసిన వారు గెలిచే ప్రయత్నానికి పూనుకున్నారా అంటే అదీలేదు. సిండికేట్ వడవడి ఇలా ఉంది. ప్రధాన మంత్రి తన సంతకానికే విలువ ఇవ్వలేదు; సంజీవరెడ్డిగారి నామినేషన్ కాగితాలు దాఖలు చేసి ఆయనకి ఎదురుగా పని చేశారు. ఇదీ అవసరం లేని పని.

## ముందే చెయ్యవలసినది...

ఈ వారం జరిగిన సంఘటనలని, పరిణామాలని పరిశీలిద్దాము. శ్రీ ఎస్. కె. పాటిల్ ఎన్నో కబుర్లు చెప్పవచ్చునని కాంగ్రెసు అధ్యక్షుడు, శ్రీయుతులు ఫక్రుదీన్ అలీ అహమ్మద్, సుబ్రమణ్యాలని సరిగ్గా కార్యవర్గ సంఘం సమావేశం ముందు తొలగించి ఉండకూడదు. అసలు శ్రీ నీలం సంజీవ రెడ్డిగారు ఓడిపోగానే శ్రీయుతులు ఫక్రుదీన్ అలీ అహమ్మద్, జగజీవనరామ్‌లని తొలగించి ఉండాలి. ఇప్పుడు చెయ్యటం వల్ల అది ముఠా తత్వం లాగ కనిపిస్తుంది.

ఇంకా చెప్పాలంటే, అఖిల భారత కాంగ్రెసు సభ్యులలో నాలుగు వందల అయిదు సంతకాలని మేడమ్ గాంధిగారి అనుచరులు, మియాన్ ఫక్రుద్దీన్, బాబూ జగజీవనరామ్‌లు పోగు చేసినప్పుడు కాంగ్రెసు అధ్యక్షులు ఆ సవాలుని స్వీకరించి ఉండవలసింది. ప్రధాన మంత్రిని కాంగ్రెసు పార్లమెంటరీ పార్టీవారు ఎన్నుకున్న సిద్ధాంతం మీదనే అ. కాం. వారు కాంగ్రెసు అధ్యక్షుడిని ఎన్నుకుంటారు. [ఈ పోలిక సరి కాదని కొందరు అనవచ్చు కాని నిజానికి ఉన్న పరిస్థితి ఇదే.] ఈ సవాలుని కాంగ్రెసు అధ్యక్షుడు సాహసంతో ఎదుర్కొని ఉండవలసింది.



అంక్టాడ్ ప్రధాన కార్యదర్శి డాక్టర్ ఆర్. ప్రెబిష్

## రెండు కాంగ్రెసులు

మేడమ్ గాంధిగారు పోటీ కార్యవర్గ సంఘం సమావేశం ఒకటి జరిపారు. ఇదీ అక్రమమయిన పనే. ఆమె, ఆమె అనుచరులూ శ్రీ నిజలింగప్ప అధ్యక్షత వహించిన సమావేశానికి వెళ్ళి, తమ అభ్యంతరాలని తెలిపి, అవసరమయితే బయటికి వచ్చేసి ఉండవలసింది.

స్వార్థం, అహంకారం ఇరువయిపులా ఉన్నాయి. వీటి ఫలితంగా దేశం అతి ప్రమాద పరిస్థితిలో ఉంది. నిలకడగా ఉన్నదన్న ప్రశస్తి పొందుకున్న పరిపాలన దెబ్బ తింటోంది.

ప్రస్తుతం రెండు కాంగ్రెసు కార్యవర్గ సంఘాలు ఉన్నాయి., రెండు అఖిల భారత కాంగ్రెసు సమావేశాలు కూడా జరిగేట్లు ఉన్నాయి. ఇద్దరినీ వదిలివేస్తే, కాంగ్రెస్ అధ్యక్షుడూ, ప్రధాన మంత్రీ రాజీ చేసుకోవచ్చు. తమ మధ్య ఆశయాలకి సంబంధించిన ద్వేషాలు లేవని శ్రీ నిజలింగప్ప స్పష్టంగా చెప్పారు కూడా. ఇదంతా కేవలం ఇద్దరి మధ్య ఏర్పడిన స్పర్థల ఫలితం. ఈ స్పర్థలని కొందరు స్వార్థపరులు రేకెత్తిస్తున్నారు. ఖాళీలు ఏర్పడ్డాయి కాబట్టి తమకి అవకాశం వచ్చిందని లాలా గుల్జారీలాల్‌నందా తమ అజ్ఞాత వాసాన్ని వదిలి మేడమ్ గాంధిగారి అ. భా. కాం. సం. సమావేశం కోసం చురుకుగా పని చేస్తున్నారు. నేపాల్‌లో రాయబారి శ్రీ రాజబహద్దూర్ ఉద్యోగం గడువు తీరిపోతోంది కాబట్టి ఆయన కూడా ప్రకటనలు చేస్తున్నారు. శ్రీ మొరార్జీకీ, మేడమ్ గాంధికీ పడటం లేదని శ్రీ ఢేబర్ అనే పక్షం వహిస్తున్నారు. ఈ రకం చీలిక రాష్ట్రంలో అన్ని స్థాయిలకీ వ్యాపిస్తోంది.

## ఖాయం

మేడమ్ గాంధిగారి కాంగ్రెసు సంఘం సమావేశం కావటం ఖాయం. నేటి పరిస్థితుల దృష్ట్యా ఇది కాంగ్రెసు నాశనానికి కారణం అయితీరుతుంది.

కాం[గెసు పార్లమెంటరీ పార్టీలో కల్లోల పరిస్థితి దీనికి నిదర్శనం. మొన్న జరిగిన సమావేశంలో రబాత్ విషయమయి శ్రీ దినేష్‌సింగ్‌కి విశ్వాస తీర్మానం లభించ లేదు. దీనినిబట్టి పార్లమెంటులో ఏమి జరగనున్నదో వూహించ వచ్చు. రబాత్‌తోబాటు, బాబూ జగజీవన్‌రావ్‌గారి పన్ను పనూళ్ళు, రాజస్థాన్ ముఖ్యమంత్రి శ్రీ సుఖాడియా మీద ఉన్న కొన్ని ఆరోపణలు బాగా చర్చకి లోనవుతాయి.

## ప్రతిపక్షాల మద్దతు

1970 జనవరిలో ఎన్నికలు జరగవు అనటానికి వీలులేదు. ఇది మేడమ్ గాంధీగారికి అనుకూలంగా ఉంటుంది. ప్రస్తుతం ఆమె కీర్తి వెలిగిపోతుంది. తేలికగా గెలిచి 1975 దాకా అధికారంలో ఉండ గలరు ఆమె. అసలు శాసనసభలో ఆమె ప్రభుత్వం వోడిపోయినప్పటికీ ఆమె ప్రభుత్వం పడిపోవనవసరం లేదు. శాసనసభలో ఈ పని జరిగే అవకాశం అంతగా కనిపించదు. కమ్యూనిస్టులు, ద్రా. ము. క., సం. సో. పా., ప్ర. సో. పా. ఆమెనే బలపరుస్తారు. సుమారు 80 మంది కాంగ్రెసు వారే ఆమెకి ప్రతికూలంగా వోటు వేసినా కాం. పా. పక్షం నుంచి ఆమె విశ్వాస తీర్మానాన్ని తెచ్చుకో గలరు.

## మంత్రులకి తీరిక...

ఇదంతా బాగానే ఉంది కాని దేశం మాట ఏమిటి? పరిపాలన జరగటమే లేదు. ముఖ్యమయిన శాఖలని పరిపాలిస్తున్న మంత్రులు పార్టీ తగవులలో మునిగి తీరిక లేకుండా ఉన్నారు. శ్రీ ఫక్రుద్దీన్ ఆలీ అహమ్మద్ 'లైసెన్సింగ్ కమిటీ' మినిట్స్ మీద సంతకం పెట్టే తీరిక కూడా లేదు.

ఆర్థిక, రయిల్వే శాఖలకి సరయిన అధిపతులే లేరు. ఆర్థికశాఖ చూసుకునే తీరిక ప్రధానమంత్రికి ఉండేదని వేరే చెప్పనవసరం లేదు. చలికాలంలో శాసన సభలు సమావేశం అవుతాయి. డిసెంబరు, జనవరిలలో రయిల్వే బడ్జెట్లు తయారు కావాలి.

నేడు అందరికన్నా సంతోషంగా ఉన్నవారు కమ్యూనిస్టులు. కమ్యూనిస్టుల పత్రికలు చూస్తే ఈ సంగతి అర్థం అవుతుంది. కాంగ్రెసు నాశనమే వారి ప్రధాన లక్ష్యం. ఇది ఇంచుమించు సాధించారు. రెండవది, ప్రధాన మంత్రిని తమ వయిపుకి తిప్పుకొనడం, ఇందులోనూ వారు నెగ్గుతున్నారు. ప్రధాన మంత్రికి వారి బలం రోజురోజుకీ కావలసి వస్తోంది. ఇక మూడవది అధికారాన్ని చేజిక్కించుకొనటంకోసం అరాజకాన్ని సృష్టించటం. పశ్చిమ బెంగాలులో ఇప్పటికీ శాంతి భద్రతలు లేవు. నాలుగవది, భారతదేశానికి పాశ్చాత్య దేశాలలో మిత్రులు లేకుండా చెయ్యటం. దీనికోసం తగిన ప్రయత్నాలు జరుగు తున్నాయి. దేశంలో కల్లోల పరిస్థితి ఏర్పడే ప్రమాదం అధికంగా ఉంది.

# అక్షయ యూత్సవం

## హాస్యాను గేయాలు

### * శిశిర *

(గత సంచిక తరువాయి)

27\. రేబవలు పరిశ్రమించు
చదువకుండ సమీక్షించు
శ్రీవాత్సవ ఇంచుమించు
అన్నింటను వేలుముంచు.






29\. కుంచెచేత పట్టుకుంటె
కుచగిరులను దిద్దుతూంటె
వసాగారు వళ్లుమరచు
పురుషులకును రొమ్ములుంచు.




28\. ప్రాచీన కథామరంద
మాధురీ మధువ్రతమ్ము
గణపా పిలకతిరుశాస్త్రిల
కథలకు సుస్వాగతమ్ము.

(ఇంకా ఉంది)

# ఆశ్లేష

వై. రాంబాబు శాయి



బెల్లావిస్టా స్టాప్‌లో బస్‌దిగి, బెదురు బెదురుగా చూశాను. మహానగరానికి రావడం మరీ మొదటిసారేమో, గుండె చప్పుడు కొంచెం వేగంగా ఉంది. ఆ రోజు ఉదయమే పూరీలో వొచ్చాను. నాంపల్లినుంచి నారాయణరెడ్డింటికి నాలుగు రూపాయ లడిగాడు. అచ్చ తెలుగొచ్చినా అసలు రానట్టు నటించిన రిక్షావాడు—అక్కడ రెడ్డి అద్దెకుంటున్న గదిపక్క బాత్ రూంలో పైపునీళ్లతో పట్టిన చెమట సంతా వదుల్చుకుని, చాకలి శరభయ్య ముక్కుతూ మూలుగుతూ యిస్త్రీ చేసిన బట్టలు వేసుగుని, ఆఫీసు వెదుక్కోడానికి బయలుదేరాను.

పెద్ద పెద్ద అక్షరాలతో అటువైపు అలనాడెప్పుడో కట్టివున్న ఆ సౌధం వద్ద ఆఫీసుపేరు కనిపించగానే కొండంత సంబరం కలిగింది. సముద్రంలాంటి నడిరోడ్డుని తరించి. ఆ పాతమేడ గేటుదాటి లోపల కడుగుపెట్టాను. అక్కడ లెక్కపెట్టలేనన్ని వాహనాలు విశ్రాంతి తీసుకుంటున్నాయి. స్కూటర్లున్నాయి. మోటారు సైకిళ్లున్నాయి. రకరకాల కార్లున్నాయి. ఒకమూల లారీ ఒకటుంది. దానిపక్కనే నగం చెడిన బస్సొకటి. ఇంచక్కా నిద్రపోతోంది. వాటిని దాటుకుని, రిసెప్షనిస్టు దగ్గరకు వెళ్లాను. రిసెప్షనిస్టు అందంగా మాత్రంలేదు' నన్ను నవ్వుముఖంతో చూసింది.

జేబులోంచి గవర్రంగులో ఉన్న గవర్నమెంటువారి ఆర్డరు కాగితాన్నితీసి. చూసుకోమని సుందరి ముందు విసిరాను. ఆ కాగితం విప్పడానికే ఆమెకు అయిదు నిమిషాల పర్యంతమైంది. విప్పిచూసిన ఒప్పులకుప్ప — నోరైనా విప్పకుండా ఎడమచేతి చూపుడువేలిని ఎదురుగా ఉన్న మెట్లవెంపు చాపింది. అతిజరూరుగా ఆర్డరుకాగితాన్ని అందుకుని మెట్లమీదికి దూసుకున్నాను.

ఎస్టాబ్లిష్‌మెంట్ అసిస్టెంటు సెక్రటరీ వారి గది గుమ్మంముందు స్టూలు మీద చతికిలబడి బీడీ పొంగల స్వర్గంలో తేలిపోతున్నవాణ్ణి పర్మిషన్‌కోసం ప్రార్థించి, అయ్యవారి ముందు నిలబడ్డాను, నా ఆర్డరు కాగితాన్నీ, నా విన్నపాన్నీ అవధరించి అయ్యవారేవో అక్షరాలు రెండు మాత్రం ఆ కాగితంమీదనే రాశారు.

'యుహేవ్ టు గివ్ జాయినింగ్ రిపోర్ట్' అన్నారు.

రాసిచ్చాను.

'గివ్‌దెమ్ టు వాసన్. హివిల్ డైరెక్ట్ యు' అన్నారాయన.

వాసన్‌గారు నన్ను ఫెయిర్ కాపీయింగ్ సెక్షన్‌లో మూడు నెలపాటు ట్రెయినింగ్ కమ్మని నోట ఆర్డరు జారీ చేశారు.

ఆ విధంగా ఆఫీసులో ఒకమూలకు జేరి, నిట్టూర్పు విడిచాను. బొత్తిగా అన్యాయమైన (బి. ఏ.) చదువు చదివి రెండేళ్లపాటు కన్నతండ్రిని విసిగిస్తూ యింటిపట్టునే నిరుద్యోగిగా గడిపి, ఆ ఉద్యోగమనీ, ఈ ఉద్యోగమనీ అప్లికేషన్లకే అయిదువందలు తగలెట్టి ఎట్ట

కేలకు ఏదో ఒక ఉద్యోగం లెమ్మని సర్వీస్ కమిషన్‌వారి కరుణాకటాక్షాలవల్ల చిన్న తరగతి గుమస్తాగా హైదరాబాదులో ఉద్యోగం ప్రారంభించిన ఆ క్షణంలో ఆ నిట్టూర్పు అతి సహజంగా ఉంది. నిరుద్యోగ శృంఖలాలు పెటిల్లున తెగిన క్షణం అని.

నిట్టూర్పు వెనక రిసెప్షనిస్టు చటుక్కున జ్ఞాపకం వొచ్చింది. 'కొంతమంది కోమలులంతే. చూచిన వెంటనే సుందరులనిపించరు. కనుమరుగైనా కంటిముందు నిలుస్తారు,'

పక్కగదిలోంచి టైపిస్టుల చప్పుళ్ళు అతిభయంకరంగా వినిపిస్తున్నాయి. కొత్తగా వచ్చినవాణ్ణి గనక నా పక్క గుమాస్తా తనగురించి గొప్పగా కోయడం ప్రారంభించాడు. ఈ లోగా మా సెక్షన్ సూపర్నెంటు—తెల్లగా బొద్దుగా ఉన్నాయన—వొచ్చాడు.

'ఆనంద చక్రవర్తి అంటే మన్వేనా?' అనడిగాడు.

అవునని తలూపాను.

'మూణ్ణెల్లు సప్లై సెక్షన్‌లో ఉండాలిట. ఫెయిర్ కాపీయింగ్ సెక్షన్‌లో ట్రెయినీస్ నేర్చుకునేదేవిటో నాకు తెలీదు. అయినా తప్పదు. ఇక్కడ ఇలా చదువుకుంటూ, తప్పులు దిద్దుకుంటూ కూచోవల్సిందే' అని చెప్పి పక్కగదిలోని తన సీట్లోకి వెళ్ళిపోయాడు సూపరింటెండెంటు.

సీనియర్ గుమస్తా ఏవో ఓసీలు చదువుతూంటే నేను యఫ్‌సీలు సరిదిద్దుతూ ఒంటిగంట వరకూ గడిపాము. అప్పటికే అత్మారాముడు ఆకలితో పత మత వహొత్తున్నాడు.

'మనకో చక్కటి కాంటీన్ ఉందండోయ్ చక్రవర్తిగారూ? అక్కడేమైనా తిన్నా తాగినా రాత్రికి భోజనంకూడా చేయనక్కర్లేదు.' అన్నాడు మా సీనియర్ ఛార్లెస్.

ఛార్లెస్ మాటల్లోని వ్యంగ్యం పూర్తిగా నా కర్థంకాలేదు. అయినా బాగుండదన్నట్టు నవ్వి, ఆ కాంటీన్ ఏవిటో చూదామని వెళ్ళాను.

కాంటీన్ పైకప్పు ఒక చివికిన తడక. కాలాడిన బల్ల ఒకే ఒక్కటి అతిథు కేర్పాటు చేయబడ్డ ఆసనం. బల్లకావల తడక చాటున బొగ్గుల పొయ్యిమీద టీకెటిల్ పక్కనే పెద్ద పళ్ళెంలో వడలూ, బజ్జీలూ,

పొడుగ్గా, వల్లగా ముసలితనంతో ముసిముసి నవ్వులతో ఒకాయన నన్నాహ్వానించి కూర్చుండబెట్టాడు.

'దప్తర్ కు నయా ఉన్నవ్? ఈడ చా మంచిగుంటది. వడ ఉన్నది. బజ్జీ ఉన్నది. ఏంది కావాలి?' అనడిగాడతను.

అతనేదేశంవాడో నా కంతుపట్టలేదు. వట్టి చా మాత్రం తాగదలచుకున్నాను. ముసలాడందించిన కప్పూ సాసరూ కరాంగుళులతో బిగించి వేడి పానీయాన్ని పెదవులకు తాకించాను. ఆ సమయానికే ఎవరో కాటీన్‌లో అడుగుపెడితే తలెత్తి చూశాను. రిసెప్షనిస్టు. నన్ను చూచి నవ్వింది. మనిషి అంత అందమైనది కాకపోయినా, ఆ నవ్వుమాత్రం ఎంత బాగుందని! నవ్వినప్పుడు సొట్టలుపడ్డ ఆబుగ్గలెంత బావున్నాయని! చూపు నిలబడిపోయింది.

ఆవిడ అక్కడ ఆగకుండా బల్లకావల తడకచాటుకు వెళ్ళిపోయింది.

టీ తాగుతూ ఆలోచిస్తున్నాను. ఆమె వయస్సు ఇరవైకి తక్కువకాదు. నాకన్న పెద్దదే కావొచ్చు. అందంగా, సన్నగా, పొడుగ్గా ఉండే స్త్రీలంటే చూడాలనిపిస్తుంది. ఈవిడ అంత అందంగాలేదు. సన్నగాలేదు. పొడుగ్గాలేదు.

ముసలాడిని పిలిచి, పైసలిచ్చి, మళ్ళీ సీట్లోకి వొచ్చి కూచున్నాను,

మనిషి అంతర్యం మహా చెడ్డది. రవంత సేపు ఒంటరితనం లభించనీ అది గతాన్ని తలపోసుకుంటుంది. గతంలోని మధుర ఘట్టాల్ని నెమరు వేసుకుంటుంది. గతం ఒక్కోసారి గర్వకారణమే.

కాగితం అందుకుని, కామాక్షికి ఉత్తరం రాయడానికి పూనుకుని, ఆ పిల్లనెట్లా సంబోధించాలో తెలీక తికమకపడి, గతాన్ని తలపోసుకుంటూ కూర్చుండిపోయాను.

కామాక్షి నాతోబాటు చదువుకుంది. భావిజీవితం గురించి నాతో కలలుకంది. చీట్లపేకాడుతూ ఆవేశంతో చేతులు కలిపిన మొండిపిల్ల కామాక్షి. ఓసారి ఏదో మాటా మాటా వొచ్చి ఆరునెలలు నాతో మాట్లాడ్డం మానేసి, కనీసం నావొంక కన్నెత్తైనా చూడకుండా గడిపి, ఒకనాటి రాత్రి పెనుతుఫానుమాదిరి పడిపోయి, భోరుమని ఏడిచేసింది, కామాక్షి ఎంత మొండి ఘటమో అంత అమాయకురాలు. ఎంత అమాయకురాలో అంత చమత్కారి. ఎంత చమత్కారో అంత అందగత్తె.

కామాక్షిని తలచుకుంటే బోలెడంత గర్వం అనిపించింది అందమైన ఆడపిల్లలతో పరిచయం అంతా యింతా గొప్ప కాదు.

'డియర్ కామాక్షీ!' అని ఉత్తరం ప్రారంభించా అనుకున్నాను. అతి సాదాగా ఉన్నట్టనిపించింది. 'ప్రియమైన స్నేహితురాలికి' అందామా అంటే అది మరీ ఎబ్బెట్టుగా కనిపించింది. మీమాంసలో కొట్టుకులాడుతూ ఉండగానే చార్లెస్ వొచ్చాడు. అదేదో అర్జంటన్నాడు. గడగడా చదవడం ప్రారంభించాడు. నాకు తెలీకుండానే సాయంకాలమైపోయింది.

బస్‌స్టాప్‌లో రిసెప్షనిస్టు నిలబడ్డుంది. ఆమెతోబాటు పదిమంది బస్‌కోసం ఎదురు చూస్తున్నారు. ఆమెపక్కనే నిలబడ్డాను. నన్నుచూచి తలవాల్చుకుంది. రెండుక్షణాల తరవాత తలఎత్తి, 'ఏ సెక్షన్‌లో పోస్టు చేశారు' అనడిగింది.

'యఫ్. సి. లో' అన్నాను.

నవ్వింది.

'ఎందుకూ కొరగానివాళ్ళని పోస్టు చేస్తారందులో. ఫరవాలేదులెండి. కొన్నాళ్ళు పనిజేస్తే మంచి సెక్షన్‌లో వేయించుకోవొచ్చు' అంది.

ఆమె మాటలు కమ్మగా ఉన్నాయి. ఆ మాటలద్వారా ఆమెఅంతర్యం అందంగా కనిపించింది.

'మీ పేరేవిటన్నారు?' అని అడిగిందామె.

చెప్పాను.

'అందమైన పేరు సుమండీ!' అంది.

ఆమె పేరేవిటో అడుగుదామనుకున్నాను గాని, ఇంతలో బస్సొచ్చింది. జనం ఎగబడ్డారు. నిలబడేందుకు నాకు సీటు దొరికింది. ఆమె లేడీస్‌సీట్స్‌లో ఒకసీటు దొరికించుకుని, నన్ను చూచి గర్వంగా నవ్వింది. — ఆ నవ్వు నన్ను చాలా యిబ్బంది పెట్టు





ఉదూ కామాక్షి గొప్ప అందమైనదిగాని యింత అందంగా నవ్వడం ఆమెకు రాతకాదు.

నాకు చాలా ఆశ్చర్యం అనిపించింది. మహానగరంలో మొదటిరోజున ఈ పిల్ల నన్ను చాలాదూరం తీసుకువెళ్ళింది. మన సుతో నిలుపుకున్న కామాక్షిలో ఇంత కాలమూ నాక్కనిపించని ఒకలోటును చూపింది. కామాక్షికీ ఈమెక్కూ పోలిక చాలా అన్యాయమే కావొచ్చుగాక!

కొంచెం పల్చగా, మరికొంచెం లావుగా, దివ్వంగా నవ్వుతూ, అందమే తనైనట్లుగా ఉన్న తరుణి నామధేయం ఆశ్లేష అని ఆ మరునాడు చార్లెస్ చెబితేనే గాని తెలిసిందికాదు.

వారాంతంలో—వాల్ట్ డిస్నీ చిత్రంగదా అని మనసుపడి మధ్యాహ్నం ఆటకు నేనూ ఛార్లెస్ వెళ్ళాం. మగాళ్ళ క్యూ మరీ పొడుగ్గా ఉంది. మినహాయింపుల లైనులో ఎవరైనా ఎరిగున్నవాళ్ళు కనిపిస్తారేమో నని వెళ్ళాను. అక్కడ ఆమె కనిపించింది. నన్నుచూచి తన సహజధోరణిలో నవ్వింది.

'యూ వాంట్ ఎ టికెట్— డోంట్ యూ?' అని అడిగింది.

'నాట్‌వన్ — టూ టికెట్స్ ప్లీజ్' అంటూ నోటందించాను.

ఆశ్లేష ఎక్కడ కూచుందో తెలీదుగాని సినిమా విడిచిపెట్టాక ఔట్‌గేట్ పక్క వారి ముగ్గురు మగువలతో నాకోసమే ఎదురు చూస్తున్నట్టుగా నిలబడుంది.

'ఈవిడ మా పెద్దాదిన. విమెన్స్ కాలేజ్‌లో మాథ్స్‌లెక్చరర్. పేరు కిర్మీర. ఇదిగో ఈవిడ మా చిన్నాదిన—కల్పలత. పి. అండ్ టి. లో టైపిస్టుగా చేస్తోంది. ఈవిడ మా అమ్మగారు' అంటూ అందరినీ నాకు పరిచయం చేసింది.

'వనితో వని. మీ యింట్లో ఎవరెవరున్నారో ఏంచేస్తున్నారో కూడా చెప్పేస్తే కూడదా!' అనడిగాను.

మరి ఆ నవ్వులోని మహత్తేమిటో తెలీదుగాని — నా కొక్కడికే అలా అని పిస్తుందో ఏమో విరగనుగాని—అత్యంత సహజంగా, మహాద్భుతంగా నవ్వి — 'మా చరిత్రంతా సుళువుగా రాబట్టేసేయాలని చూస్తున్నారల్లే ఉంది. అదేం కుదరదు. మీరు మా యింటికొస్తే వివరాలన్నీ తెలుసుకోవొచ్చు. మరి మాకిక శలవు' అంటూ వాళ్ళని తీసుకుని గుంపులో కలిసిపోయింది.

ఆశ్లేషతో యిలా సాన్నిహిత్యం ఏర్పడినందుకు నాకొక విధంగా గర్వంగానే ఉంది గాని ఎందుకో మనసులో ఏమూలో రవంత అనుమాన రేఖ తళుక్కుమంది. ఈ పిల్ల ఈవిధమైన సమ్మోహనాస్త్రం విడిచి, నాకు సన్నిహితవౌతూ ఏమైనా వలవన్న దలచుకుంటే—...ఈ ఆలోచన దారుణమైనదే అనిపించింది.

దూరంగా నిలబడ్డ ఛార్లెస్, నేను దగ్గర కాగానే — 'ఏం మిష్టర్! ఆశ్లేష నీ వెంటబడిందా?' అన్నాడు.

నా గుండె గతుక్కుమంది. వెర్రిముఖం వేసుకుని చూశాను.

'నీకావిడ సంగతి తెలీనట్టుంది. జనాన్ని తనచుట్టూ ఎలా తిప్పుకోవాలో ఆవిడకి తెలిసినట్టుగా మరెవ్వరికీ తెలీదు. వెధవ నవ్వు నవ్వుతుంది.'

ఛార్లెస్‌ను ఏదో అడగాలనిపించిందిగాని—అతనిమీద ఆ క్షణంలో రేగిన ఆగ్రహం కొద్దీ ఏం అడగాలనుకోలేదు. కోపం వొచ్చిందంటే రాదూ! ఆశ్లేష అందమైన నవ్వును వెధవ నవ్వంటాడా!! జనాన్ని తన చుట్టూ తిప్పుకోగల టెక్నిక్ ఆమెకు తెలిసి ఉండొచ్చుగాక! ఆ నవ్వు చూచిన వాడెవడూ ఆమెను పల్కరించకుండా ఉండలేడు మరి!

నాలుగురోజుల్లో నాకు అతి సన్నిహితమైన ఆశ్లేష గురించే ఆలోచన సాగింది. నారాయణ గుడాలో సాయంకాలపు పొడుగాటి నీడ డాబామీద కుర్చీపక్క ఆలోచనతో వేడెక్కింది.

ఆశ్లేష తనచుట్టూ జనాన్ని ఎందుకు తిప్పుకుంటుంది? పెళ్ళికానిపిల్ల అందంగా నవ్వితే ఆశపడ్డవాళ్ళు చివరకు నిరాశతో, ఉక్రోషంతో పుట్టించిన కట్టుకథ కాకపోతే ఆశ్లేషకు ఈవిధమైన దుర్గుణం ఎందుకుంటుంది? అంటే — ఆఫీసు వాళ్ళందరికీ ఆశ్లేషమీద మంచి అభిప్రాయం లేకపోయి ఉండొచ్చు. లేక ఛార్లెస్ ఆశ్లేషకోసం అర్రులు చాచి, ఎదురుదెబ్బతిని ఉండొచ్చు. ఏమైనా ఆశ్లేషతో పరిచయం కొంచెం యింట్రెస్టింగ్‌గానే ఉంది.

సోమవారంనాడు ఉదయం సరిగా వేళకు ఆఫీసు చిడీలు అధిరోహిస్తున్నప్పుడు ఆశ్లేష నవ్వుతూ అభివందనం చేసింది. ఆ మధ్యాహ్నం క్యాంటీన్‌లో సాయంకాలం తనతోబాటు యింటికి రావలసిందని ఆహ్వానించింది. కొంచెం ఆలోచించి— 'ఇవేళ కాదండీ! కొంచెం అర్జంటు పనుంది' అని తప్పించుకున్నాను. ఆ మరునాటి మధ్యాహ్నం కూడా ఆమె ఆహ్వానాన్ని ఏదో



[illegible]

ఆ వారంలో ఆశ్లేష మళ్ళీ నన్ను తమ యింటికి ఆహ్వానించలేదు. కనిపించినప్పుడల్లా కమనీయంగా నవ్వడం మాత్రం మానలేదు.

ఈలోగా ఎస్టాబ్లిష్‌మెంటులో శర్మతో పరిచయం కొంచెం ముందుకు సాగింది. ఆఫీస్ కాంటీన్ విడిచి నేను పక్కనే ఉన్న వి. జి. కాంటీన్‌కు వెళ్ళడం ప్రారంభించాను.

ఏదో మాటల సందర్భంలో ఆశ్లేష గురించి సంభాషణ లేవదీశాను. శర్మ మరీ నిదానం మనిషి. ఏ విషయం గురించీ తన సొంత అభిప్రాయమంటూ చెప్పడు. ఆశ్లేష గురించి అతనేమీ చెప్పలేదు. బహుశా అతనికి మనుషుల గురించి ఏవిధమైన ఇంట్రస్ట్ లేదేమో ననిపించింది.

మళ్ళీ సోమవారం వచ్చింది. ఆ సాయంకాలం కామాక్షినుంచి ఉత్తరం వొచ్చింది. కామాక్షి అక్షరాలు చూడగానే గతుక్కుమన్నాను. గత పదిరోజుల్లోనూ నా ఆలోచనలనిండా ఆశ్లేష ఆవరించి ఉందిగాని, కామాక్షి గురించి తలచుకున్నది లేదు. ఇది నిజంగా చాలా ఆశ్చర్యాన్ని కలిగించే విషయం. కామాక్షి తన ఉత్తరంలో రెండు ముక్కల్లో అదే రాసింది— హైదరాబాదు చేరుకున్న మరుక్షణంలోనే ఉత్తరం రాస్తానని మాటిచ్చి వొచ్చినవాడివి పది రోజులకు కూడా కార్డుముక్క రాయకపోతే కలిగిన కోపం కామాక్షి ఉత్తరంలో అలతిగా అగుపించింది. మరుక్షణంలో కాగితం కలం తీసుకుని, ఉత్తరం రాయడానికూర్చున్నాను.

ఇంకా చీకటి తెరలు అలముకోలేదు. నారాయణరెడ్డి ఎక్కడికి వెళ్ళాడో తెలీదు. గదిలో ఒంటరితనం నిశ్శబ్దంగా ఉంది.

'డియర్' అని ప్రారంభించాను.

'నీ ఉత్తరం కొంచెం కోపంగా ఉంది. నిజంగానే నిన్ను మరిచిపోయాను. ఇక్కడో అమ్మాయి పరిచయమైంది. నీకన్న అందమైనది...'

కామాక్షిని ఉడికించడంకోసం లేనిపోనివన్నీ రాసి, కవరంటించి, బయట పోస్టు డబ్బీలో పడవేశాను. తిరిగొస్తూంటే, ఆశ్లేషా, వాళ్ళ చిన్నవాదినా కన్పించారు.

'ఏమిటిలా వొచ్చారు' అడిగింది.

[illegible]

గనక వన్నుకట్టమన్నారుగాదు. మేముండేది చిక్కడపల్లిలో స్వామి!' అంది ఆశ్లేష.

వెళ్ళిపోతూ, వెనక్కి తిరిగి—వెంకటేశ్వర స్వామి గుడివక్కనే మాయిల్లు. కనకరత్నం అని మానాన్నగారి పేరుతో నేమ్‌ప్లేట్ ఉంటుంది. మీకెప్పుడైనా రావాలనిపిస్తే రండి' అంది.

కల్పలత మాత్రం—'ఇప్పుడు రాకూడదటండి!' అంది.

'వాకు రావాలనిపించినప్పుడే వొస్తాలెండి' అంటూ చురకవేశాను.

ఆశ్లేష దొంగ కోపం నటించింది. ఇద్దరూ బ్రిడ్జివైపు నడిచారు. రోడ్డు దాటిన తరువాత, చెట్టు నీడలోంచి వెనక్కి తిరిగిచూసింది ఆశ్లేష. అప్పటికింకా అక్కడే నిలబడి, వాళ్ళవైపే చూస్తున్నాను.

గదిలో చీకటలముకుంది. అయినా లైటు వెలిగించలేదు కిటికీలోంచి రోడ్డుమీద పోయేజనం కనిపిస్తున్నారు. ఆడవాళ్ళా మగవాళ్ళా జంటగా వెళ్ళిపోతున్నారు. అలా ఎంతసేపు కూచున్నానో నాకే తెలీదు ఆలోచనలు మనిషిని అస్వస్థుణ్ణి చేస్తాయి కాబోలు!

రెండు మూడు రోజుల తరువాత ఒకసారి ఆశ్లేషా వాళ్ళింటికి వెళ్ళాలనిపించింది గాని నిగ్రహించున్నాను అకారణంగా అయినవాళ్ళింటికైనా పోకూడదు.

రోజులు గడుస్తున్నాయి.

కామాక్షి ఉత్తరం రాసింది. ఆ ఉత్తరంలో నా అబద్ధాలనన్నీ గాలికొదిలేసి, వాళ్ళ నాన్నగారేదో సంబంధాలు చూస్తున్నారని రాసింది, సమయం మించనే కూడదు. అంత అయిన వెనక అలోపాలో మనడంవల్ల ప్రయోజనం ఉండదు. మా పితృదేవులకు కామాక్షి విషయమై రాసేయాలని నిర్ణయించుకున్నాను.

మగవాడన్నవాడు మనువాడక తప్పదు. మగువలెందరో మనసును లోబరుచుకోజూస్తారు. ఏ పెళ్ళికాలమూ కలలుకంటూ కూచోడం సాధ్యంకాదు. వలచి, వలపించుకుని వనితమెళ్ళో మూడుముళ్ళూ వేసే అదృష్టం అందరినీ వరించదు. అందుకే, మనసుకోరిన మగువ చేజారిపోకుండా జాగ్రత్తపడటం మాత్రం మగవాడి బాధ్యత.

[illegible]

ఉక్కిరి బిక్కిరి చేసింది. ఆ రాత్రి నక్కమీదికి చేరినప్పుడు కామాక్షి అలా ఎందుకు రాసిందో తెలిసిపోయి, కొన్ని నవ్వొచ్చింది. నిదరో అందమైన అమ్మాయిగురించి [illegible] నేడిపించడానికే ఉత్తరం వ్రాశానని గ్రహించుకొంది గనక తనకోసం ఏవో సంబంధాలు చూస్తున్నారని రాసింది కామాక్షి.

గాఢ నిద్రలో కామాక్షి కలలోకి వొచ్చింది. చేయందుకోబోతే దూరదూరంగా పారిపోయింది. కూడా పరుగులు పెట్టాను. ఒక పెద్ద కొండపైనుండి కామాక్షి కెవ్వుమని అరిచింది. ఎంత వెదికినా కనిపించలేదు. లోయలో ఆశ్లేష పడిఉంది. కొనఊపిరితో ఉంది. నన్ను చూచి తన అందమైన నవ్వునవింది.

'ఆశ్లేష!' అని అరిచాను ఆశ్చర్యంగా భయంగా బాధగా.

గదిలో ఆశ్లేషలేదు. కొండలేదు. చిక్కని చీకటి గదంతా అలముకుంది.

ఆరోజు శనివారం. సాయంకాలం ఆఫీసునుంచి వొచ్చేస్తున్నప్పుడు ఆశ్లేష మళ్ళీ తన ఆహ్వానాన్ని రిన్యూచేసింది. 'రేపు మాత్రం మీరు మాయింటికి రాకతప్పదు. ఎంచాతంటే రేపు నా పుట్టినరోజు. మీరు తప్పక రావాలి. రేపుసాయంకాలం మీకోసం ఎదురుచూస్తుంటాను' అని చెప్పింది.

ఆదివారంనాటి సాయంకాలం ఓమాదిరిగా అలంకరించుకుని వెళ్ళాను. ఓ గులాబిపువ్వు చేతబుచ్చుకున్నాను. కొత్త రూపాయి కాగితాన్ని ఒక తెల్లషీట్‌మీద పిన్‌చేసి—'జీవితం కొత్తరూపాయికాగితం' విచారంతో నలిగిపోకుండా చిర్నవ్వుతో అందంగా దాచుకోండి' అని రాసి జేబులో పెట్టుకున్నాను.

నేనిచ్చిన గులాబిపువ్వును ఆనందంగా అందుకుని, తలలో పెట్టుకుంది. కవరు విప్పి, నేను రాసింది చదివి, 'థేంక్స్' చెప్పింది. ఇంట్లో ఎవ్వరూలేరు అందరూ బయటికి వెళ్ళిపోయినట్టున్నారు.

'మీ పుట్టినరోజుకు యిల్లంతా ఖాళీగా ఉండేదేమిటండీ!' అనడిగాను.

ఆశ్లేష నవ్వేసి — 'అబద్ధం చెబితేగాని మీరు మాయింటికి రారని నాకు తెలుసు' అంది.

[illegible] అయింది, ఆమె పుట్టి

వ్రాణా ఎప్పుడైనా వరవాలేదు. కాని, నామీద ఇంత యింట్రెస్ట్ ఆమెకెందుకు?

నా ఉత్సాహమంతా నీరుకారిపోయింది. కుర్చీలో మెదలకుండా కూచున్నాను. తిన డానికి తీపిగా పెట్టింది. కారంపెట్టి తీపిని చంపేసింది. తాగడానికి వేడిగా అందించింది. నాతోబాటు తనూ కాఫీ రుచిచూస్తూ — 'నన్ను మీరు అపార్థం చేసుకుంటున్నారు అవునా? అని అడిగింది.

నేను నివ్వెరబోయి చూస్తున్నాను.

'మీ మనసులో ఏముందో నాకు తెలుసు. నేనేదో మిషపెట్టి యిక్కడికి రప్పించా నని మీకు చాలకోపం వొచ్చుంటుంది. అయినా నిజం చెప్తేస్తాను ఇవాళే నా పుట్టినరోజు.'

నేను నవ్వలేదు. నిజంగానే కోపం వొచ్చింది.

'అన్నిమాటలూ మీరే అనేస్తున్నారు. నా మనసు మీకు తెలుసన్నారు. కాని నిజంగా మీకు తెలీదని నాకు తెలుసు' అన్నాను.

ఆశ్లేష ముక్కుపుటాలు ఎగురు తున్నాయి. నాకళ్ల వంక సూటిగా చూస్తోంది.

'మీకీసారి నిజంగానే కోపం వొచ్చి నట్టుగా ఉంది. మీ మనసేమిటో నాకు తెలీదనడం నిజంగా అన్యాయమే. తొలి రోజున మీ ముఖంచూసే మీ మనసెటు వంటిదో నేను చదివేశాను. రిసెప్షనిస్ట్‌గా అది నాధర్మం. మీకు ముక్కుమీదే కోపం.

# ఆశ్లేష

అది రెండునిమిషాలే నిలుస్తుంది. మీరు ప్రతివిషయాన్నీ సీరియస్‌గా తీసుకుంటారు. ప్రతి చిన్నవిషయం గురించీ గంటలు గంటలు ఆలోచిస్తారు...' అని చెబుతూ మళ్లీ మామూలుగా నవ్వేసి, 'మీరు నవ్వక పోతే మాత్రం బావుండదు' అని ఈసారి వకవకా నవ్వింది.

నా నిగ్రహం పన్నుగిల్లి పోతోంది. కోపాన్ని మరి అభినయించలేక పోయాను.

'మరెవ్వరినీ పిలవలేదా!' అనడిగాను.

'ఇంకెవ్వరినీ పిలవాలనుకోలేదు.' ఇంట్లో వాళ్లందరూ సినిమాకి వెళ్ళేశారు. పుట్టినరోజున ఇలా ఒంటరిగా కూచు న్నాను.'

చాలాసేపు ఏం మాట్లాడాలో తెలియ లేదు. ఆశ్లేష నాకళ్లవంక సూటిగా చూడడం గమనిస్తున్నాను. ఆరోజుపుట్టిన రోజు పండుగ. వంటరిగా కూచుంది. ఆశ్లేష అలా ఎందుకు చెప్పాలి!!

'మా అన్నయ్య లిద్దరూ ఏం చేస్తున్నా రని అడిగారుగదా! పెద్దన్నయ్య మెడికల్ రిప్రజెంటేటివ్ రెండో అన్నయ్య సెక్రటేరియట్‌లో అసిస్టెంటు'

'ఈ మాత్రం చెప్పడానికేనా నన్ను యింటికి పిలిచారు' అనడగాను.

ఆశ్లేష చాలా గంభీరంగా చూసింది. నా స్వభావం ఆమెకు పూర్తిగా అర్థమై ఉండదు. ఎదుటిమనిషి బలహీనతను ఒక

తన్నేతన్నితే — నిజమంతా — బయటప పోతుంది. మనసు గాయపడినప్పుడే నా స్థితి విశదమయ్యేది.

'మీతో కొంచెం కష్టమే సుమండీ!' అంది ఆశ్లేష.

నేను సూటిగా చూస్తూనే ఉన్నాను. ఆమెలోని మార్పుల్ని గమనిస్తూనే ఉన్నాను. ఆమెకూ పౌరుషం ఉంది. అయినా ఆ పౌరుషాన్ని మించిన నిగ్రహం ఆమెలోఉంది.

'మరి నే వెళ్తాను' అని లేచాను.

'అప్పుడప్పుడు వొస్తుంటారుగదా !' అని అడిగింది.

'మీవాళ్లకేం అభ్యంతరం లేకపోతే నేనిటు భోజనానికి వొచ్చినప్పుడల్లా వొస్తుంటాను' అన్నాను.

'హోటల్లోనా మీ భోజనం! చెప్పారు కాదేం? ఇవాళ మా యింట్లో భోజనం చేయకూడదా !' అని అడిగింది.

'మరో రోజెప్పుడైనా నాకు భోజనం చేయా లనిపించినప్పుడు చేస్తానులెండి' అన్నాను.

నా విసురును ఆమె చిరునవ్వుతో నిపితే పింది.

'మీ యిష్టం' అని మాత్రం అంది.

అది మొదలుగా ఆ యింటికి నారాక పోకలు అధికమయ్యాయి. సాయంకాలం వేళల్లోనే కాకుండా, శెలవురోజుల్లో మధ్యాహ్నవేళల్లో కూడా వెళ్లడం ప్రారం భించాను.

ఆశ్లేషకు పేకాట పిచ్చికూడా ఉందని తెలిసింది. మరింకేం! శెలవు రోజొచ్చిం దంటే చాలు—కాఫీ తాగేసి వెళ్లేవాడిని. కాలం తెలిసేదిగాదు. అప్పుడప్పుడు వాళ్ల వదినలో అన్నయ్యలో చేతులు కలిపేవారు. వాళ్ళమ్మగారు కూడా తరచు ఆడేవారు. ఈ విధంగా వాళ్ల కుటుంబంతో నా పరి చయం అధికమైపోయింది.

నవంబరులో కొత్తగా హైదరాబాదులో అడుగుపెట్టినవాడిని తిరిగి నవంబరొచ్చినా యింటికి వెళ్లలేదు. కాజువల్ లీవులన్నీ గంగలో కలిసిపోతున్నాయేగాని ఏనాడూ శెలవుపెట్టి ఎరగను. ఫెయిర్ కాపీయింగ్ సెక్షన్‌లో ట్రెయినీగా అడుగుపెట్టిన వాడిని పర్మనెంటుగా అక్కడే ఉండ పోయాను. కొమాక్షినుంచి ఉత్తరాలు

మీరు మెలకువగా వుండగానే కుర్రాళ్లు ఈపని జేసారంటే నే ఛస్తే నమ్మను!



మామూలుగానే వొస్తున్నాయి. జవాబు రాయడానికి ఎక్కడలేని బద్ధకమూ అడ్డొస్తోంది.

సాన్నిహిత్యం మనిషికీ మనిషికీ మమతను పెంచుతుంది. మొదట్లో ఆశ్లేష అంటే అయిష్టం లేనివాడిని క్రమంగా కొండంత అభిమానం పెంచుకున్నాను. ఒక్కరోజు ఆశ్లేషను చూడకపోతే మనసు మనసులో ఉండేదిగాదు ఒక్కోరోజు పేకాట జోలికి పోకుండా ఏవేవో కబుర్లు చెప్పుకుంటూ కూచునేవాళ్లం.

ఆశ్లేష ఎంత అందంగా నవ్వగలదో అంత సునిశితంగా ఆలోచించగలదు. ఎంతగా నవ్వుతుందో, ఆమె హృదయంలో అంతగా బాధని అణచి పెట్టుకోగలదు.

ఒకరోజు సాయంకాలం—

గదిలో ఆశ్లేష ఒక్కటే ఆలోచిస్తూ కూచున్నపుడు వెనగ్గావెళ్లి కళ్లుమూసాను ఉలిక్కిపడలేదు. మెల్లగా నా చేతులు తప్పించి, తన చేతులతో అలాగే పట్టి ఉంచి, ఎంతో బాధగా నా కళ్లల్లోకి చూసింది.

ఆమె అలా చూసినప్పుడు నేను కరిగిపోయాను.

'ఏం జరిగింది ఆశ్లేషా!' అని అడిగాను.

మామూలు మాదిరిగా కాకుండా, పెదవి విరిచి నవ్వింది ఆశ్లేష.

'నేన్నిజం చెబితే నువ్వు తప్పుగా అర్థం చేసుకోవుగదా!' అని అడిగింది.

నేనేమీ చెప్పలేదు.

'ఇన్నాళ్లూ నువ్వు నాకు చాలా దగ్గరయ్యావు నేన్నిజంగా చెబుతాను. నువ్వేం అపార్థం చేసుకోనని మాటిస్తావా?'

ఆమె కుడిచేతిని వెచ్చగా నొక్కాను.

'నాకీ యింట్లో మనసువిప్పి చెప్పుకోడానికెవ్వరూ లేరు. నువ్వు పరిచయం కాక ముందు చార్లెస్ నన్ను పరిచయం చేసుకోవాలని ప్రయత్నించాడు. మంచివాడనుకున్నాను. ఒకరోజు ఈ గదిలోనే నన్ను ఒంటరిగా లొంగదీసుకోవాలని ప్రయత్నించాడు. నాకప్పటివరకు నిజంగా ఈ స్త్రీ పురుష సంబంధాలగురించి ఏం తెలీదు అతన్ని చెంపమీద కొట్టాను. అప్పటినుంచి వాడితో మాట్లాడ్డం మానేశాను.'

నేను వింటూ కూచున్నాను.

# ఆశ్లేష

'మా పెద్ద వొదిన చాలా మంచిది. ఆమాటకొస్తే మా చిన్న వొదిన అంతకంటె మంచిది. కాని వాళ్ళిద్దరూ ఒక విధంగా నాకపకారం చేస్తున్నారు. ఇది చెబితే మధ్య నువ్వు నవ్వుతావేమోనని భయంగా ఉంది.'

నా ముఖంవంక ఒకసారి చూసి, నాచేతులు వదిలేసి, ముఖం వాల్చుకుని చెప్పసాగింది.

'వాళ్ళిద్దరూ పెళ్ళైనవాళ్ళు. చిన్న వొదినకి సెక్స్ పుస్తకాలంటే చాలా యిష్టం. అప్పుడప్పుడా పుస్తకాలు తెచ్చి నన్ను చదువమని బలవంతం చేసేది. నిజంగా అవి చదవడం మొదట్లో నాకిష్టం ఉండేదిగాదు. అయినా రాను రాను అవి చదవాలనే ప్రబలమైన కోర్కను అణుచుకోడం అసాధ్యమైపోయింది. నాలో ఏమూలో దాగిన వాంఛని వీళ్ళిద్దరూ బయటికి లాగుతున్నారు. పెద్ద వొదిన వొద్దన్నానంటే తన అనుభవాన్ని పూసగుచ్చినట్లు చెబుతూంటుంది. నేనేం చేయను! నేనూ మనిషినే. నాలోని కోరికల్ని ఎంత అణుచుకుందామన్నా, సాధ్యం కాకుండా ఉంది...'

ఈ మాటలు చెబుతున్నప్పుడు ఆమె కళ్ళల్లో ఎరుపుంది. శరీరంలో వణుకుంది. ఆమె ఒళ్ళంతా తపనతో కుతకుతలాడుతున్నట్లుగా ఉంది.

ఆశ్లేషని చూస్తే జాలేసింది. మనిషి నిగ్రహానికున్న పరిహద్దుంది. చుట్టూ వాతావరణం నిగ్రహాన్ని నిలబడనీయనప్పుడు ఆడది ఆశ్లేష ఏం చేయగలదు!!

'కూచోండి! కాఫీ తీసుకొస్తాను' అని చెప్పి ఆమె లోపలికి వెళ్ళింది.

ఆశ్లేష తన విచిత్రకథని నాకెందుకు చెప్పిందో తెలీడంలేదు. ఏ నిర్ణయానికి రావటానికీ భయంవేసింది.

మగువమనసు విప్పిచెప్పినా, మనసు పరచి చెప్పినా అసలు సంగతేమిటో అవగతం కాదు.

ఇద్దరమూ కాఫీలు తాగాం. కాసేపు పేకాట ఆడుకున్నాం. అంతసేపూ ఆశ్లేష తలవంచుకునే ఉంది. ఎప్పటిలా ఉత్సాహంగా లేదు.

'నువ్వు పెళ్ళి చేసుకోకూడదా ఆశ్లేషా?' అన్నాను.

ఆశ్లేష చాలా సేపటివరకూ పెదవి విప్పలేదు.

'మా నాన్నగారు ఈ యిల్లుతప్ప మరేం సంపాదించలేదు. అన్నయ్యలు కట్నాల్లేకుండా పెళ్ళిళ్ళు చేసుకున్నారు. కాని నన్ను చేసుకోడానికి కట్నంలేనిదే ఎవరూ అంగీకరించడం లేదు. ఇప్పటికి పదిమందైనా నన్ను చూసివెళ్ళారు...'

ఆమె నిట్టూర్పు విడిచింది.

'నా కిప్పట్లో పెళ్ళికాదు చక్రవర్తీ! ఈ వాతావరణం మారితే నాకు పెళ్ళికాక పోయినా యిబ్బందిలేదు. వర్కింగ్ విమెన్స్ హాస్టల్లో చేరతానంటూంటే అమ్మ ఒప్పుకోడంలేదు. వీళ్ళందరి మధ్యా నే నలిగి పోతున్నాను...'

అప్పటికి బాగా చీకటి పడిపోయింది— గదికి బయలుదేరాను. దారిపొడుగునా ఆలోచిస్తూనే ఉన్నాను. ఆకలి చచ్చిపోయింది. తొనుస్తూనే పడకమీదికి జేరాను.

ఆశ్లేషకు పెళ్ళైతే బావుణ్ను. కాని, కట్నంలేనిదే ఆమెకు పెళ్ళికాదు. అన్నలిద్దరూ ఆమె విషయం పట్టించుకోరు. వొదినలిద్దరూ ఆమెను ప్రశాంతంగా బతకనీరు. తల్లి — అడది—ఏంచేయగలదు!!

ఈ పరిస్థితిలో నేనేం చేయగలను! నారాయణరెడ్డి సలహా అడుగుదామనుకున్నాను. కాని అతను కథంతావిని, ఒక వెకిలినవ్వు నవ్వుతాడని భయపడి కళ్ళు మూసుకుని పడుకున్నాను.

మరునాడు ఒళ్ళంతా నొప్పులుగా ఉంది. ఆఫీసుకి శలవుపెట్టాను. సాయంకాలానికి మాటమూడు జ్వరంవచ్చింది. రెండవ రోజున కూడా శలవుచీటీ పంపక తప్పలేదు. ఆ సాయంకాలానికి జ్వరం తగ్గలేదు. డాక్టరు దగ్గిరికి వెడదామని బయలు దేరాను. నాకు తెలీకుండానే ఆశ్లేష వాళ్ళింటికి వెళ్ళాను.

ఆశ్లేష ఆరోజు మామూలుగా నవ్వింది.

'ఏంటిస్వామీ! ఎప్పుడూలేంది శలవు పెట్టావ్' అన్నది.

జ్వరం అని చెప్పలేదు. చెబితే సినిమాకొస్తానని, అక్కడే ఉండిపొమ్మంటుంది.

'ఏంలేదు — శలవు పెడదామని మనసు

మాట కొంచెం తడబడింది. ఒంటి మీద చెయ్యేసి చూసింది ఆశ్లేష.

'ఏమిటిది—ఒళ్ళు పేలిపోతోంది. జ్వరం వచ్చిందా!' అనడిగింది.

టెంపరేచర్ చూసింది. నూటనాలుగు. 'వెళ్తా'నని లేచాను. తనమీద ఒట్టు పెట్టుకుంది. అప్పుడు చూడాలి ఆమె కళ్ళు. నీళ్ళు వెల్లువికొచ్చి, గిర్రున తిరుగుతూ దూరంగా తెల్లమేఘం వెనకనుంచి కన్పిస్తున్న రెండు నక్షత్రాల్లాగా ఉన్నాయి. అప్పుడు చూడాలి ఆమె పెదవులు. అంత అందంగా నవ్వే ఆ పెదవులు కొంచెం భయంతో, తనకు అత్యంత అభిమాన పాత్రమైన నాకు జ్వరం వచ్చిందన్న ఆవేదనతో చలికాలంలో తెల్లవారు జామున గడగడ వణుకుతున్నట్టు.

మంచంమీద పడుకున్నాను. దుప్పటి కప్పింది. డాక్టరొచ్చి, యింజక్షన్ యిచ్చి వెళ్ళాడు.

ఒక రాత్రివేళ మెలకువ వచ్చిచూస్తే, ఆశ్లేష నాకాళ్ళదగ్గర పడుకునుంది.

అప్యాయంగా తల నిమిరాను. ఆమెకు మెలకువ వొచ్చేసింది. లేచి నిలబడింది.

'ఆశ్లేషా!' అన్నాను.

'మంచినీళ్ళు కావాలా? కొంచెం గ్లూకోజ్ కలిపి యిచ్చేదా!'

తాగాను. మళ్ళీ ఒళ్ళు తెలీలేదు. తెల్లవారి మెలకువ వచ్చింది. లేచి, ముఖం కడుక్కుని, వాలు కుర్చీలో పడుకున్నాను. ఆశ్లేష బలవంతాన కాఫీ తాగాను.

డాక్టర్ వచ్చి ఇంజక్షన్ చేశాడు.

అలా జ్వరంతో మూడురోజులు పడి ఉన్నాను. ఆ మూడురోజులూ ఆశ్లేష ఒక్కక్షణం కూడా నన్ను విడిచి ఉండలేదు. సమయానికి సరిగ్గా అరకులిమ్మా, కాఫ్యాయల్పునేస్తూ, ఇంత గ్లూకోజ్ అని బార్లీ అని బలవంతాన పోస్తూ రక్తసంబంధం ఉన్న వాళ్ళకన్న ఎక్కువగా సేవ చేసింది.

ఆశ్లేషని చూస్తుంటే నాకెంతగానో గర్వం కలిగిది. ఆ వెనువెంటనే జాలీ, విచారం కలిగాయి. ఆశ్లేషవంటి ఆడది సహచరి అయిన వాడిదే అదృష్టం. ఆమె నిజంగా మనిషికాదు. ఆమెలో అన్ని మంచి గుణాలూ మూర్తీభవించి ఉన్నాయి.

గదికి వెళ్ళిపోతానని మూరాం చేశాను గాని ఆశ్లేష ఒప్పుకుంది గాదు. వాళ్ళమ్మగారు కూడా బలవంతం చేశారు.

ఆరోజంతా పేకాట ఆడుతూ గడిపాము. కాసేపు పులి—మేకా ఆడాం.

ఆ రాత్రి సరిగా నిద్రపట్టే వేళకు పక్కగదిలోంచి పెద్దన్న మాటలు గట్టిగా వినిపిస్తున్నాయి.

'ఆది పెళ్ళికానిపిల్ల. అతనెవరో ముక్కూ ముఖం తెలీని వాడితో యిరవై నాలుగ్గంటలూ గడుపుతోంది. అమ్మా! రేప్పొద్దుట ఏదైనా మాటొస్తే మనం తలెత్తుకు తిరగలేం' అంటున్నాడు.

నా నిద్ర ఎక్కడికి వెళ్ళిపోయిందో తెలీదు. ఆశ్లేష మంచితనాన్ని, అమృత హృదయాన్ని మిగతవాళ్ళంతా అపార్థం చేసుకుంటున్నపుడు, నా నీడనిచూసి వాళ్ళు భయపడుతున్నపుడు నారక్తం దహించుకుపోయింది.

అలాగే పడుకున్నాను.

ఆశ్లేష రాత్రి పొద్దుపోయాక గాని గదిలోకి రాలేదు. వొచ్చి నా నుదుటిపై చేయివేసింది. కళ్ళువిప్పి చూశాను,

'నువ్వింకా నిద్రపోలేదా? అనడిగింది.

'నిద్రరావడం లేద'న్నాను.

'కొంచెం బోర్నవిటా తాగుతావా?'

తల అడ్డంగా తిప్పాను.

'ఆశ్లేషా!' అని మెల్లగా పిలిచాను. నాకేదో చెబుదామని ఉంది. కాని నా పెదవులు కదల్లేదు. ఆశ్లేష అలా మంచం పక్కనేఉంది. ఆశ్లేష జీవితాన్ని నేను మార్చగలనా!!

దూరంగా కా మా క్షి నిలబడింది. కామాక్షి సంగతి ఆశ్లేషకి తెలీదు. నాకు కామాక్షి కావాలి, అందానికి ప్రతీకఅయిన కామాక్షిని చేజేతులా వొదులుకోలేను. కాని ఆశ్లేషనిచూస్తే అమితమైన జాలేస్తోంది. నామనసు ఎటూ నిర్ణయించుకోలేని ఒకానొక భయంకర వలయంలో కొట్టుకుంటోంది.

నిద్రపట్టేసింది.

ఆ ఉదయం అందరిదగ్గరా శలవు తీసుకుని గదికి వొచ్చాను. నారాయణరెడ్డి నన్నుచూసి ఆశ్చర్యపోయ్యాడు.

'మవ్వేమైపొయ్యావో తెలీక భయ ఆ మరునాడు ఆఫీసుకు వెళ్ళాను. నన్నుచూసి ఆఫీసులో వాళ్ళు గుసగుసలాడారు. ఏమిటేమిటో అనుకున్నారు.

ఆశ్లేష వాళ్ళింట్లో జనం నాగురించి అనుకుంటున్నదేమిటో స్పష్టమయ్యాక మరి వాళ్ళింటికి వెళ్ళడానికి మనస్కరించలేదు.

నాలుగురోజులు పోయాక—'యింటికి రావడమే మానేశావు' అంది ఆశ్లేష.

ఆ సాయంకాలం వాళ్ళింటికి వెళ్ళాను. నన్నుచూసి ఆ శ్లే ష సంబరపడింది. ఆ సంతోషం చూసి నిజంగా ముచ్చట పడ్డాను.

'నీకోవిషయం చెప్పాలను కుంటున్నాను' అన్నాను ఏకాంతంగా ఆమెతో.

ఆమె ఏవిధమైన ఆత్రం చూపలేదు. కామాక్షివిషయం జాగ్రత్తగా వింది.

'నువ్వు తొందరగా ముహూర్తం పెట్టించు. కామాక్షిని తప్పక చూడాలి. మీ అమ్మగారిని కూడా చూడాలనుంది' అంది.

ఆ రాత్రి నిద్రపట్టే వేళవరకూ ఆశ్లేషే ఆలోచనల్లో నిలిచిఉంది.

కామాక్షి విషయం విన్నతరవాత ఆశ్లేష కట్టుకున్న అందమైన గాలిమేడ కూలిపోయి ఉంటుంది. ఏకాంతంలో గతాన్నంతా తలచుకుని, ఆశ్లేష తన దురదృష్టానికి కుమిలికుమిలి ఏడుస్తుంది. ఆమె అందమైన కళ్ళు వర్షాకాలం నాటిరాత్రి మేఘాలు శుభ్రపడి వెళ్ళిపోయాక జాలిగా దీనంగా చూచే రెండు నక్షత్రాల్లాగా ఉంటాయి. కన్నతల్లీ, తోడబుట్టిన అన్నలూ, పరిణామం తెలీకుండా ప్రవర్తించే వదినలూ; సంఘంలో అలముకున్న విపరీత భావాలూ, చుట్టూ వాతావరణం ఆశ్లేషను ఆశ్లేషగా ఉండనివు. ఆమె నాతో అల్లుకున్న అందమైనకల మధ్యలో ఆగిపోయినప్పుడు, ఆమె తనని తను తిట్టుకుంటుంది. భవిష్యత్తును చీకటిగా చూస్తుంది. కట్నం యిస్తేనేగాని నేను కాని పెళ్ళికొడుకులూ, నాకడకు నేనూ ఆమెనొక విధంగా మోసంచేశానని అను కుంటుంది.

కాని నేనేం చేయను!?

కామాక్షి నేం చేయను ???




## 2

ఉదయాన్నే లేచిన రాజశేఖరం విస్తుపోయాడు తానా సోఫాలో వున్నందుకు, రాత్రి జరిగిన సంగతి అస్పష్టంగా కదిలిందతని మదిలో. మాధవి జ్ఞప్తికి వచ్చింది. మనస్సు వికలమైపోయింది. సిగ్గుతో ఏమీ ఆలోచించలేక పోయాడు. వెంటనే బాత్‌రూమ్‌లోకి వెళ్ళిపోయాడు.

స్నానంచేసి వస్తూన్న అతనికి మాధవి ఎదురైంది.

పసుపువన్నె పట్టుచీర కట్టింది. అదే రంగు జాకెట్టూ వేసుకుంది. తలలో కనకాంబరాలు. కనులనిండుగా కాటుకా, నుదుట గుండ్రని కుంకుమరేఖ! తాంబూలం రక్తిమనలదుకున్న అందాల పెదవులపై చిలిపి చిరునవ్వుల చిందులు!

'రాధా! న...ను...వ్వే...నా!?' అతడు ప్రతిమలా నిలబడిపోయాడు. మాధవి ఆ చీరలో అచ్చు రాధలా కన్పించిందతనికో క్షణం. 'దివినుంచి భువికి దేవతగా మారి దిగిరాలేదుగదా! నా రాధ!' ఆ ప్రేమపూర్ణహృదయం సంశయంతో, ఆనందంతో వూగిసలాడి పోయింది.

ఆ బంగారు క్షణం అలాగే నిలిచి పోవాలని భగవానునికి ప్రణమిల్లాడు మనస్సులో.

రెప్పవేయకుండా చూస్తూన్న రాజశేఖరాన్ని చూసి ఆశ్చర్యపడింది మాధవి. ఏమో అనబోయి ఆగిపోయింది. అతని మనస్సున చెలరేగిన భావాల సందడిని గమనించింది. మౌనం వహించింది కావాలనే. ఆ క్షణాన ఏమాట అన్నా ఆమమతా భరిత హృదయం ముక్కలైపోతుంది. దుఃఖంతో బీటలు వారుతుంది, అని మాట్లాడకుండానే వెళ్ళిపోయింది.

తరువాత అతడు తన గదిలోనికి వెళ్ళి తలుపులు మూసుకున్నాడు. అరగంట గంట గడిచినా అతడు బయటికే రాలేదు. మాధవి తోటవైపునున్న కిటికీలోనుంచి చూసింది.

అలమారుదగ్గర నిలబడి దేనినో చూస్తున్నాడతడు. తర్వాత భోజనానికి తానే పిలిచింది. రోజూ మౌనంగా ముగించి మూగవానిలా వెళ్ళిపోయేవాడు; ఆ రోజు మాధవితో తానే మాట్లాడాడు ముందుగా.

'మాధవీ! నువ్వుకూడా వడ్డించుకో రాదూ! పొద్దెక్కింది బాగా!'

భోజనం బల్లమీద వుంచి హాలులోకి వెళ్ళి తలుపుదగ్గరే నిలబడుతుంది. ప్రతి రోజూ అలాగే జరుగుతోంది. ఆమె అక్కడ నిలబడివుంటుందని అతనికి తెలుసు. తనకేమైనా కావలసినపుడు వంచినతల యెత్తి తలుపువైపుకు చూసేవాడు. వచ్చి వడ్డించి వెళ్ళేదామె. ఆరోజాతనిమాట వినగానే ఆశ్చర్యపోయింది.

'లేదులే బావా! అత్తయ్యా నేనూ ఒకసారే 'తింటాంలే' అన్నది మాధవి నవ్వి.

'అరే! అమ్మ యింకా భోంచేయనే లేదూ?' తల్లినిగురించి ఆనాడే ప్రశ్నించాడు. పూజ ముగించి లేవబోతూన్న రాజ్యలక్ష్మమ్మగారి కామాట వినగానే మనస్సు ద్రవించిపోయింది. మరోసారి భగవానునికి ప్రణమిల్లింది.

'అమ్మ భోంచేయకేం చేస్తుందిరా? నాయనా! కొడుకు కాపురాన నిప్పులు కురిసినా తిని తిరక్క తప్పడం లేదుగా!' ఆక్రోశించిందా మాతృహృదయం కమలలో నీరు తిరుగుతూండగా.

త్వరగా ముగించి వెళ్ళాడతడు. మాధవి భోజనాదుల్ని ముగించుకుని హాల్లోకి వెళ్ళి రేడియో వింటూ కూర్చుంది; రాజశేఖరం ఏదో మాట్లాడాలన్నట్లు వచ్చాడక్కడికి. కానీ వెంటనే వెళ్ళిపోయాడు.

ఆ సాయంత్రం మాధవి 'బావా! మద్రాసు బీచి బావుంటుందంటారు; చూపించవా ఓసారి!' అని అడిగింది. వెంటనే అంగీకరించాడతడు. అందుకెంతో సంతోషించారు రాజ్యలక్ష్మమ్మగారు.

బీచిలో కూర్చుని మాధవి సముద్రం వంకే చూస్తూండి పోయింది. చల్లనిగాలి వీస్తోంది. మనస్సున హాయి వేయికలలు గంటోంది. మధురాతి మధురమైన వూహాలెన్నో మల్లెలై మరిమళాల్ని విరజిమ్ముతున్నాయి.

'బావా! మావూరోసారి రాకూడదా?' అన్నది మౌనాన్ని చీలుస్తూ. వెంటనే జవాబు చెప్పలేదతడు. మాధవివంకే చూస్తూ అన్నాడు—

'రాలేను! మాధవీ!' ఎందుకో నిరాశ ధ్వనించిందతని కంఠాన,

'ఊహూ! రావలసిందే! రేపు అన్నయ్య వస్తున్నాడుగా! అందరం కలిసి వెళ్ళొచ్చు!' అన్నదామె.

'ఎవరూ! సారధా! వస్తున్నాడా? ఎందుకూ?' ఆశ్చర్యం ప్రకటించాడతడు.

'నన్ను తీసుకువెళ్ళడానికి' అని ఆమె అతని కళ్ళలోకి సూటిగా చూస్తూండి పోయింది.

'ఆహ!' అని మౌనంలో విలీనమైపోయాడతడు. ఆ జవాబులో ఏ భావమూ ధ్వనించలేదు. ఆ కనులలో విరిసిన

వూహల మల్లియలు కన్పించనే లేదు. ఆతడు వెంటనే తలవంచుకుని చేతివాచీ వంకే చూస్తూండి పోయాడెంతోసేపు.

తర్వాత సాగరుని అందాన్ని చూస్తూండి పోయా రిరువురూ. కానీ ఒకరినిగురించి ఒకరు ఆలోచించుకుంటున్నారు. ఇరువురూ ఓ వ్యక్తినిగురించి, భవిష్యత్తునుగురించి రక రకాలుగా వూహించుకుంటున్నారు.

వెన్నెల వెలుగులో ప్రకృతి అందం ఎంత మెరిసిపోతోంది. ఇసుకలో గీతలు గీస్తూన్న మాధవి తలెత్తకుండానే అన్నది.

'చదువూ, సంస్కారం వున్నవాళ్ళు వ్యసనాల్ని కావాలని ఆహ్వానించడంమూలానే సంఘం యింతగా పాడైపోతోంది' ఆ విమర్శ బాణంలా సూటిగా ఆ డాక్టరి హృదయాన నాటింది. వ్యంగ్యం ఏమా త్రమూ లేదా విమర్శలో. కాని బాధ, సాను భూతి నిండివున్నాయి.

మనస్సు పువ్వులా సున్నితంగా వుంటుంది కొందరికి. ఆ సున్నితత్వం గాయపడినపుడు జీవితాన్నే కాల్చివేసుకుంటారు వాళ్ళు. అది బలహీనతే అవుతుంది. ఎంతటి బాధ విరుచుకు పడినా తన మూలాన మరొకరు కుమిలి పోనీయకుండా చూసుకోవడంలోనే మనిషి విలువ పెరుగుతుంది' అన్నదామె తిరిగి.

మృదువైన ఆ వ్యంగ్యోక్తి కతని హృదయాన సంచలనం తుఫానులా చెలరేగింది. లోలోన అనుకుంటున్నట్లు అన్నాడత డామె వైపు చూస్తూ—

'బలహీనత నెలా జయించాలి ?' పసి పాపలా ప్రశ్నించాడు.

క్షణమాత్రం ఆతనివంకేచూసి మృదువుగా నవ్వింది మాధవి.

'ప్రతిదానికీ ఓ నియమం, ఓ హద్దూ ఏర్పరచుకోవాలి బావా ! అపుడే జీవితంలో ఎదురైన ఒడుదుడుకుల్ని దాటిపోగలుగుతాం. నేనూ ఒప్పుకుంటాను. సున్నిత హృదయాలు విషాదాన్ని భరించి తట్టుకోలేవన్న సంగతి. కానీ ఒకమాట మనం మరిచిపోగూడ దెప్పటికీ' — ఆగిపోయిందామె ఓ క్షణం సేపు—

'అనురాగంముందు వ్యక్తిత్వాన్ని విస్మరించ గూడదు. నిజమే! కాదనలేను. ప్రేమతోనే జీవితం నిండిపోవాలి. కానీ ఆ ప్రేమే, పిచ్చిగా మారిపోతుంది హద్దులు దాటగానే. అపుడది జీవితాన్ని కాల్చివేస్తుంది. నిండు బ్రతుకుల్ని భస్మం



జేసి వేస్తుంది. ఆ పరిస్థితుల్ని జయించలేక మరో పిచ్చిని ఆహ్వానించడం మరింత బలహీనతే అవుతుంది. పరిస్థితుల్నీ, కాలాన్నీ బట్టి నడుచుకున్నవాళ్ళ మనస్సు గాయపడినా, మనిషిగా జీవించవచ్చు.' అన్నదామె.

మౌనంగా వింటూండిపోయాడతడంత సేపూ. తర్వాత యిరువురూ లేచి యింటికి బయల్దేరారు. మాధవికా సంభాషణ వారిద్దరిమధ్యా ఎంతో ఆత్మీయతనీ, సన్నిహితత్వాన్నీ పెంచినట్లనిపించింది.

ఆ రాత్రంతా అతని హృదయం నిండుగా ఆలోచనలూ, అనుభూతులూ కొల్లలై నిలిచాయి. రేడియోలో వస్తూన్న లలిత సంగీతాన్ని వింటూండిపోయాడు కొంతసేపు.

ఎన్నో కలలు! కొన్ని మధురమైనవి. మరికొన్ని భూహించలేనంత బరువైనవి. ఆ కలల్లో మాధవీ, రాధా చెట్టపట్టాలేసుకుని పరుగులు పెట్టారు. నవ్వుల పువ్వులు రువ్వారు ఆలోచనలతో కదిలించి వేశారు. అదే లోకంఅన్నట్లు భ్రమింపజేశారు. ఉన్నట్లుండి కల కరిగిపోయిందో క్షణాన.

ఉదయభానుని లేత కిరణాలు ముఖాన నాట్యమాడుతూండగా మెలకువ వచ్చిందతనికి. అయినా అలాగే దుప్పటిలోనే వుండిపోయాడు కొంతసేపు. ఇంకా స్వప్నలోకంలోనే వుండిపోవాలని ప్రయత్నించాడు. కానీ

## మనుషులురా...

మధురమైన స్వరం వేంకటేశ్వరుని సుప్రభాతాన్ని తీయగా పాడుతోంది. ఆ స్వర మాధుర్యం అతడిని వూపివేసింది. వెంటనే లేచివెళ్ళి గది గుమ్మంముందు నిలబడ్డాడు.

రాజ్యలక్ష్మమ్మగారు పూజచేస్తోంది పూలతో. ప్రక్కనేవున్న మాధవి భక్తి ప్రపూర్ణమైన స్వరంతో ఆ వేంకటేశ్వరుని ప్రార్థించుతోంది.

విశాల నేత్రాల నిండుగా ఏదో పరవశత మెరుపులై తళుక్కు లీనుతోంది. తన జీవిత పరమావధి అదే నన్నట్లు ఆ స్తోత్రంలోనే లీనమై పోయిందామె. ప్రణమిల్లి లేచి రెండు గులాబీల్ని తీసికొని తలలో తురుముకుంది కనుల కద్దుకుని.

ఎపుడూ జారెడు ప్రొద్దెక్కినా లేవని కొడుకు అంత ఉదయాన్నే లేచి వచ్చి పూజనంత శ్రద్ధగా చూడడం ఆ తల్లికెంతో సంతోషాన్నీ, ఆశ్చర్యాన్నీ, వుత్సాహాన్నీ కలుగజేసింది. కనుసైగ జేసింది 'చూడమ్మా!' అంటూ మాధవికి. మాధవి నిర్మలంగా నవ్వింది అతడిని చూసి.

ఆ రోజంతా అతడు ఎప్పటిలా మరలా మౌనంగానే వుండిపోయాడు. అందుకా మాతృహృదయం వ్రాగిపోయింది. సారథి రాకతో ఆ డాక్టరిముఖం మరింత ముడుచుకు పోయింది. ఏదో మర్యాద కన్నట్లు పరామర్శించాడు కుశలమడిగి. భోజనాలు పూర్తికాగానే బయటికి వెళ్ళబోతూండగా మాధవి పిల్చింది—

'అదేమిటి బావా!? అన్నయ్య వస్తే పారిపోతావ్! నిన్నేమీ బలవంతంగా కట్టేసి తీసుకుపోడులే!' అన్నది చిన్నగా నవ్వుతూ. చేసేదిలేక వెనుదిరిగాడతడు వెంటనే.

*　　*　　*

ఆవూరి పేరే పల్లె! ప్రకృతి మాత అక్కడ తన అందాన్ని వేలరంగులతో వింతైన హొయలతో నాట్యమాడించుతోంది.

పూలతోటల్లో సుమసౌరభాలు మృదువుగా మనసుల్ని పలకరించుతూంటాయి. పచ్చని చిగురాకులు, పండు తమలపాకుల తోటలు చల్లదనంతో సేదదీరుస్తూన్నాయి. ఆ తోటల్లో కోయిలమ్మల కుహూకుహూ నాదాలు, మధురాతి మధురంగా, హాయిగా విన్పించుతూంటాయి. చిలుకల అందాలు వన్నెల్ని చిందించుతూంటాయి.

వూరిప్రక్కనే ఓ సెలయేరు ప్రవహిస్తోంది. అదే ఆ వూరివారికి ఆనందదాయిని. సెలయేటి అందాల్ని, గాన మాధుర్యాన్నీ వింటూ మైమరచిపోతారా పల్లెవాసులు.

గులాబీల తోటా, తమలపాకులతోటా వున్నాయి రాఘవయ్యగారికి ముగ్గురు చిరంజీవులతోపాటు.

పెద్దమ్మాయి రాధ నిజంగా గులాబీలాగా అందం నిండిన బంగారు బొమ్మే! రెండోవాడు సారథి! అక్క అంటే ఎనలేని అనురాగం ఆ పసి ఎడదలో ఎప్పటినుంచో కాపురముంటోంది కలలుగంటూ.

మూడో అమ్మాయి మాధవి. పూలలో దాగిన అందమంతా తనదే! సెలయేరు పాడుకునే మధురగీతాల్లో విరిసిన మాధుర్యమంతా ఆమెదే! ఆ గానంలో కరిగివున్న గంభీరత అంతా ఆమె సొమ్మే!

అక్కయ్య హృదయాన ఆనందాన్ని పండించుతుంది అనురాగంతో. అన్న మనస్సున మమతల మల్లెల్ని పూయించుతుంది. 'పూలబాసలు తెలుసు ఎంకికి' అన్నట్లు మాధవి మనస్సు నవనీతంకన్నా మృదువుగా వుంటుంది' అని మురిసిపోయే వాళ్ళు తల్లిదండ్రులు.

గులాబీల తోటలో పరువులెత్తుతూ



# ఎక్కువ సువాసన ఎక్కువ మెత్తదనము

మెత్తనిది, పూవువలె తాజాయైనది, సువాసనగలది

పోటీలేని క్రిమి సంహారి జి-11 గల
సింథాల్ టాయిలెట్ పౌడరు చాల సేపు నిలిచే
సువాసన మరియు పట్టువంటి మెత్తదనముతో,
మీ చర్మమునకు అంటుకొని ఉండి,
మీకు రోజంతా రక్షణ కలిగిస్తుంది.




జి-11 గల
సింథాల్ మీకు
రక్షణ యిచ్చినట్లు
వేరే ఏ
పౌడరూ
యివ్వలేదు.

INTERPUB GP 17 TEL

నవ్వుల్ని రువ్వుతూ — పువ్వుల్ని ...పోవు చేసుకుంటూ, పూవుల్లో పూవై, ఆకుల్లో ఆకై కోయిలమ్మను చిలిపిగా పిలిచి, వయ్యారంగా వెక్కిరించుతూ, యేటినీటిలో నీడని చూసుకుని మురిసిపోతూండేది పరవశించి.

పూవుల్లోని తావిని నింపుకుందా హృదయం నిండుగా.

ఆకుల్లోని అందాల్ని పంచుకుందా జీవితం పండుగే నన్నట్లు.

నవ్వుతూ పలకరించుతుంది. నవ్వుతోనే నిష్క్రమిస్తుంది. ఆ చెల్లెలి మాటలు తీరుకూ — మనస్తత్వానికీ ఎంతో మురిసి పోతూంటారా అక్కా తమ్ముళ్లు.

ముగ్గురూ బాల్యాన్నింకా దాటకమునుపే రాఘవయ్యగారు గుండెజబ్బుతో మరణించారు. సంసారం బరువంతా తల్లి సుభద్రమ్మపైన బడింది. పులిమీద పుట్ర అన్నట్లు రెండో అమ్మాయి పెళ్ళికెదిగి వచ్చిన తర్వాత తోటలమీద వస్తూన్న ఆదాయం తగ్గిపోయిందు చాలావరకు.

'రాధను' రాఘవయ్యగారి చెల్లెలు అన్నపూర్ణమ్మ కోడలిగా తీసుకుంది. అయినా సారధి, మాధవిలను సక్రమంగా పెంచి ప్రయోజకులను చేసేందుకే సుభద్రమ్మగారి తల్లిప్రాణం ఓ రకం వచ్చింది. సారధిని యింటరువరకు చదివించ గల్గింది. మాధవిని బి. యస్‌సిలో ఆపివేసింది ఆర్థిక స్తోమతు బావుండక.

# మనషులా...

చిన్నప్పటినుంచీ తల్లిమాట జవదాటని మాధవి ఎదురు చెప్పలేక మౌనం వహించింది. సారధికూడా తోటల్ని జాగ్రత్తగా పెంచాలని చదువుకు స్వస్తి చెప్పాడు. అతడెంతగా కష్టించి, శ్రమకోర్చి పెట్టుబడిని పెంచి, కొత్త తరహాల్లో పెంచినా ఆదాయం మాత్రం అనుకున్నంతగా పెరగలేదు.

దానికితోడు సుభద్రమ్మగారికా వయస్సున క్షయవ్యాధి సంక్రమించింది. మందులు వాడినా తగ్గుముఖం పట్టనే లేదెన్నాళ్ళకా మొండివ్యాధి. ఆ సమయంలోనే రాధకూడ వివాహమైన కొద్ది కాలంలోనే క్షయతో బాధపడి కన్నుమూసింది. ఆ వార్త సుభద్రమ్మగారికి ఆరని, తీరని వ్యధగా మిగిలి గుండెల్ని రంపపుకోత కోసేయసాగింది. వ్యాధితోపాటు మనోవ్యధ కూడా రానురాను కొండంతై పోయింది.

ఏ క్షణాన మంచమెక్కిందోగానీ తిరిగి దిగనే లేదు. గుండెలపైన పేసిన పాషాణ పోలే దామె. ఆ మనోవ్యధే ఆ మాతృ హృదయాన్ని కాల్చివేయసాగింది. చివరకో పుణ్య క్షణాన తనువు చాలించిందామె.

ఆ గృహాన యిక ఆలనా పాలనా చూసే వాళ్ళు లేరు. మాధవి కొండంత దుఃఖాన్ని గుండెల్లో నింపుకుని అన్నను ఓదార్చుతూ తాను పూరడిల్లుతూ కొన్నాళ్ళు గడిపింది. అన్నపూర్ణమ్మగారా పిల్లల దుఃఖాన్ని చూడలేక, తనకూ ముందూ వెనుక ఎవరూ లేకపోవడం మూలాన ఆ యింటిలో వుండిపోయింది వచ్చి.

అప్పటినుంచీ ఆ యింటిలో ఆనందం ఏనాడూ తనను తాను మరిచి నాట్యమాడ లేదు. నవ్వులతో యిల్లు ప్రతిధ్వనించిన క్షణమే లేదు. సారధి నిరుత్సాహంగా తోట పని పూర్తిచేస్తూండేవాడు. అన్నపూర్ణమ్మగారు రాధస్మృతులతో అహర్నిశలూ బాధతో కుమిలిపోతూండేది లోలోన. అల్లుడు రాజశేఖరం మదిలో మెదలినపుడామె దుఃఖానికి అంతు లేకుండా పోయేది. ఆ దుఃఖాన్ని కొంతవరకు మరిపించగలిగేది ఒక్క మాధవి మాత్రమే. నిశ్శబ్దత రాజ్యమేలుతూన్న ఆగృహాన మాధవే అపుడపుడు ఆనందాన్ని ఆహ్వానించేది. నిరాశతో కుమిలిపోతూన్న అన్నహృదయాన ఆమె నవ్వుల్ని పండించేది.

రాధ అత్తగారైన, రాజ్యలక్ష్మమ్మగారి హృదయమెంతో విశాలమైనది. సంస్కారభావాలికామె నిలయమే అనుకునే వారందరూ. తోటివారిని ప్రేమించడమే ఎరుగునుగనీ ద్వేషించడం తెలియదామెకు.

కోడలు, రాధ తమగృహాన వున్నన్నాళ్ళూ ఎంతో మురిసి ముచ్చటపడి పోయిందామె. నాపులా చూసుకుంది. మనస్సు నొప్పించ లేదే నాడూ. కానీ భగవానుడెందువలనో ఆ సంసారాన ఆనందాన్ని హఠాత్తుగా దూరం జేశాడు. రాధ మరణంతో ఆ తల్లీ కొడుకుల హృదయాలు దుఃఖంతో పొంగి పోయాయి.

ఆ వ్యధను మరువలేక రాజ్యలక్ష్మమ్మగారు మాధవిని రమ్మని జాబు వ్రాసింది. మనస్సు కరిగేలా వున్న ఆమె అభ్యర్థనను త్రోసిపుచ్చలేక పోయిందామె. అందుకే అన్నను ఒప్పించి వెళ్ళేపుడు అన్నది—

'అత్తయ్య మనస్సును నొప్పించలేనురా అన్నాయ్! ఏ సుఖమూ ఎరుగని ఆ యింట్లో కొన్నాళ్ళు తోడుగా మసలి వద్దామనే వెళ్తున్నాను.' అని.

సారధికా ప్రయాణం యిష్టం లేదు. అయినా వ్యతిరేకించలేకపోయాడు. చెల్లెలు ఏ దృష్టితో ఆ విధంగా బయల్దేరిందో గ్రహించగలిగాడు. రాధ మసలిన ఆ గృహాన మాధవి ఆనందాన్ని నింపించి రాగలదనే భావించాడు లోలోన. వెళ్ళేపుడు అన్నపూర్ణమ్మగారు కూడ అన్నారిలా—

'చూడమ్మా; మాధవీ; అత్తయ్యా



వాళ్ళు మొదటినుంచీ మనకు బంధువులు గారు. అయినా అంతకన్నా మించిన ఆత్మీయానురాగాల్ని అందించారు వాళ్ళు. కానీ ఆ అదృష్టాన్ని నిల్పుకునే అర్హత లేదు నాకు. అత్తయ్య మనస్సున అనురాగం సాగరమై ప్రవహించుతోంది. బావ ...చెప్పలేను. నువ్వే చూస్తావుగా! ఆ తల్లీ కొడుకుల్ని మళ్ళీ ఆనాటి లోకంలోకి తీసుకురా తల్లీ! అది నీవల్లనే అవుతుంది.'

మాధవి కన్నుల్లో ఆశ్చర్యం దోబూచులాడింది మాటలు వినగానే. ఏ భావంతో ఆమె అలా తనకు ఆదేశాన్నిచ్చిందో గ్రహించింది. కానీ తిరిగి జవాబు చెప్పబోయి ఆగిపోయింది. మౌనంగా అన్నకూ, అత్తయ్యకూ నమస్కరించి బయల్దేరింది.

మాధవిని చూడగానే రాజ్యలక్ష్మమ్మ గారు ఎంతో సంతోషించారు. రాజశేఖరం ఏ భావాన్నీ వెలిబుచ్చలేదు. నిర్వికారంగా వుండిపోయాడు. ఎప్పుడో రాధ పెళ్ళిలో చూసిందామె మాధవిని. అప్పుడామె వికసించని మొగ్గ. ఇప్పుడో వికసిత కుసుమం! తన ఆహ్వానాన్ని అంత తొందరగా, తేలిగ్గా అంగీకరించుతుందని ఆమె వూహించనైనా వూహించలేదు.

ఆ గృహాన అడుగుపెట్టినదే తడవుగా ఆమె అందర్నీ తన హాస్యోక్తులతో వూపివేసింది.

అందరినీ తనవైపు ఆకర్షించుకున్న మాధవిపైన ఎనలేని అనురాగం ఏర్పడింది రాజ్యలక్ష్మమ్మగారికి. రాజశేఖరం కూడా ఓ మలుపు తిరిగాడు ఆమె రాకతో.

ప్రతిదానికీ స్వక్రమంగా, సరైన పద్ధతిలో, సరైనవేళకు జరిగిపోతోంది. డాక్టరైన అతనికావని ఎంతో నచ్చింది. నమోభారంతో, మనోవ్యధతో యింటినంత పొందికగా అందంగా సమర్చలేని లోటు తీర్చగలిగింది మాధవి. అప్పుడప్పుడతని మనసున ఓ వూహ బయల్దేరి వూయల లూగుతోంది: కానీ అది వెలికి రానే లేదెన్నాళ్ళకూ.

సారధి రాక రాజశేఖరానికంతగా నచ్చలేదని గ్రహించింది మాధవి. కానీ ఎందుకో అర్థంగాలేదామెకు పూర్తిగా.

ఆ సాయంత్రం తోటలో కూర్చున్నారంతా. రాజ్యలక్ష్మమ్మగారే మాట్లాడారు

ముందుగా:

'నాకెంతో ఆనందంగా వుంది బాబా! మాధవి మాయింటిలక్ష్మిగా వుంటుందని అనుకుంటేనే'

ఏదో పుస్తకం చదువుకుంటూన్న రాజశేఖరం ఓసారి తలెత్తిచూసి మళ్ళీ చదువులో లీనమైపోయాడు. సారధి క్షణకాలం నిశ్శబ్దంగా వుండిపోయాడు. చెల్లెల్ని రాజశేఖరానికి–అర్ధాంగిగా వూహించుకోలేక పోతున్నాడతను. అసలా వూహే నచ్చడం లేదతనికి. కానీ మాధవి అంగీకారం అతడిని మాట్లాడనీయకుండా చేసింది. ఆమె అంగీకారం వెనకవున్న

## మనుషులూ...

నిశ్చలత ఎంత బలమైనదో గ్రహించే ఎదురు చెప్పలేక పోయాడతడు.

'మాధవి జీవితాన ఆనందం పండితే నాకూ సంతోషమే అత్తయ్యా! అలా కావాలనే ప్రార్థిస్తున్నాను.' అన్నాడతడు మాధవివంక చూస్తూ.

రాజ్యలక్ష్మమ్మగారు నవ్వుతూ తల వూగించారు. కొడుకువైపు చూస్తూ అన్నదామె శాంతంగా.

'ఏం నాయనా?! విన్నావా? మాధవి ఈ ముసలి అత్తయ్యసేవ జేయడానికి మనఃస్ఫూర్తిగా ఒప్పుకుంది. మనం మళ్ళీ మనుషులం కాగలమిక.'

'ఇందులో బలవంతం లేదుగదా! అయినా యింకా వసంతం రావాలని నాకు లేదన్నా! ఇలా జరిగిపోనివ్వు! మాధవి జీవితాన్ని బలిగా తీసికుంటున్నామేమో నన్పిస్తోంది.' అన్నాడు రాజశేఖరం. అతని కంఠాన ధ్వనించిన నిరాశ అందరూ కదిలిపోయారు. కంఠం కొంచెంగా వణకడం గమనించింది మాధవి. అందుకే ఆమె మరింతగా కదిలిపోయింది. అతనివంక చూస్తూ అన్నది మృదుస్వరంతో—

'అన్పించడమేగదా! అయిపోలేదుగా బావా! వూహలతోనే భయాన్ని నింపుకుని ఆనందాన్ని దూరం జేసుకోవడం మీలాంటివాళ్ళకి తగదు' ప్రేమ పూర్ణమైన ఆమె స్వరం మధురంగా నినదించింది శ్రోతల చెవుల్లో.

రాజశేఖరం, ఆమె కన్నుల్లోకి చూశాడు. వెంటనే ఆశ్చర్యాన్ని దాచుకుంటూ ఆ విశాల నేత్రద్వయంలో కదులుతూన్న అనురాగ కెరటాల అలజడి స్పష్టంగా గోచరించుతోంది అతని మనస్సున ఆమె చూపులు మల్లెలై విరిశాయి. తీయని తలపుల్ని మేల్కొల్పాయి. అందుకే పెదవి కదుపలేక పోయాడప్పైన.

సారధిలోన కదులుతూన్న అయిష్టతను అణచుకుని అన్నాడు చెల్లెలితో—

'బావా, నువ్వూ ఆలోచించుకుని మరీ నిర్ణయించుకోవడం మంచిదమ్మా! ఎందుకంటావా? ఆలోచనతో చేసినపని అయినా, కాకపోయినా ఫలితాన్ని భరించగల ఆత్మబలాన్ని చేకూర్చుతుంది.'

రాజ్యలక్ష్మమ్మగారు ఏదో మాట్లాడబోయి మాధవి ముఖంవంక చూసి ఆగిపోయింది వెంటనే.

'నిజమే నన్నాయ్! అందుకే నిన్నిక్కడకు రప్పించడం' అన్నది మాధవి. తర్వాత ఎవ్వరూ మాట్లాడలేదు. భోజనాలకు టైమయిందని లేచారందరూ.

(ఇంకా వుంది)

## 'వంట నేర్చుకోవాలి' - రాజశ్రీ

'మేమంతా ఇవాళ జానకిగారింట్లో వంటలు నేర్చుకోవడానికే రావటం కొంత ఆలస్యమయింది' అన్నది రాజశ్రీ, ఆయుధ పూజ రోజున— 'మా మంచి అక్కయ్య' సెట్స్‌లో.



'ఏమిటి విశేషం? ఎవరెవరు చేశారు వంటలు' అడిగాను.

'నేను, కృష్ణకుమారి, శీలా— ఊరికే సరదాగా, పండగకదా అంతా జానకిగారింట్లో చేరి తలోవంటా ప్రారంభించాం.'

'మీరేం వండారు?

'నేను ఐస్‌క్రీమ్ చేశాను. అంతలో స్టూడియోనుంచి పిలుపు వచ్చింది. కంగారుగా వచ్చేశాను. ఇంతకీ ఎలా వచ్చిందో, ఏమిటో తినలేదు. ఈ షూటింగ్ అయిన వెంటనే వెళ్ళి తినాలి' అన్నది రాజశ్రీ ఎంతో ఆశతో—

'ఇంకేమిటి విశేషాలు?'

'చాలా రోజుల తర్వాత కృష్ణకుమారిని చూశాను. ఈ మధ్య తను వంట చేయటం నేర్చుకుందిట. వంట చేస్తూ చెయ్యి నాడా కాల్చుకుందిట... అయినా వంటచెయ్యటం నేర్చుకోవాలండీ! ఎందుకైనా మంచిది ఎప్పుడైనా వంటమనిషి రానప్పుడు వండి పెట్టవచ్చు' (ఎవరికి? రాబోయే భర్తకేమో) అంటూ నవ్వింది రాజశ్రీ.

— మోహన్‌కుమార్

# ఎంత ప్రాప్తమో అంతే



ధర్మపథం

బులుసు వేంకటరమణయ్య

మనకు కష్టసుఖాలు; సుఖదుఃఖాలు జన్మాంతరాల్లోని సుకృత, దుష్కృత కర్మల వల్లనే కలుగుతాయి. అందువల్ల ధనవంతుడుగా జన్మించినా సుఖించలేకపోవడమూ, దరిద్రుడయి పుట్టినా నిర్విచారంగా కాలం గడపడమూ జరుగుతుంది. ధనం సమృద్ధిగా వున్నా లోభగుణంవల్ల దాన్ని అనుభవించలేక పోతున్నాం. లోభిగా పుట్టినవాడు ఒకవేళ దానం చెయ్యాలనుకున్నా అది సాగదు. నొసటి వ్రాతను బట్టి ఎంత ప్రాప్తమో అంతె లభిస్తుంది గాని మరొక విధంగా జరగదు.

ఒక లోభి ఉండేవాడు. పూర్వజన్మకృత పుణ్యం వల్లనో యేమో ఆయన గొప్ప ధనవంతుడు! అయినా ఎంగిలిచేత్తో కాకిని కొట్టడానికయినా ఒష్టపడడు, సహజమైన లోభంవల్ల. ఇలా వుండగా ఒకనాడు అతని యింటికి ఒక అతిథి వచ్చాడు. ఆ పూట భోజనం పెట్టవలెనని కోరాడు. ఈ లోభి మొదట్లో సమ్మతించడంలేదు కాని, ఆ అతిథి యెంతో ప్రాధేయపడగా విధిలేక — మనస్సులో ఏ కోశాననో వున్న ధర్మగుణం ప్రేరేపణ చెయ్యగా — తుదకు సమ్మతించి ఆ పూట భోజనం పెట్టాడు.

ఇతరులకు తిండిపెట్టడం లోభి ప్రకృతికి విరుద్ధం కదా! తన ప్రకృతికి విరుద్ధంగా ప్రవర్తించినందున కాబోలు ఆతనికి ఆ సాయంకాలం కడుపునొప్పి వచ్చింది. దానికి లంఖణమే పరమౌషధమని ఆ రాత్రి తిండి మానివేయవలసి వచ్చింది. ఆ బాధతో మూలుగుతూ అతను పడుకున్నాడు. అతనికి నిద్ర పట్టలేదు.

కొంత రాత్రి అయ్యాక అతనికి — తాను పడుకున్న గదిలోనే యిద్దరు సంభాషిస్తూ వున్నట్లు వినబడింది. మనుష్యులు మాత్రం కానరాలేదు.

ఒక గొంతుక — ఓయీ లోభమా! నీ యజమాని పరోపకారంకోసం ఒక ప్రాణికి తిండిపెట్టాడు గదా! అలాటి వాడికి కడుపునొప్పి తెప్పించి, తిండి లేకుండా చెయ్యడం నీకు న్యాయంగా వుందా?

మరొక గొంతుక — ఓ ధర్మమా! అతిథికి భోజనం పెట్టడం లోభికి న్యాయం కాదు. ఒకపూట భోజనం పెట్టాడంటే అతని సంపదలో ఒకపూట భోజనం తగ్గిపోయిందన్నమాట. ఆ లోటును ఎలా భర్తీ చెయ్యమంటావు? అందుకోసమే అతనికి కడుపునొప్పి తెప్పించాను. దానికి ఫలితంగా అతడు రాత్రి భోజనం మానివేశాడా? లేదా? ఇందువల్ల మిగులు చూపించానా లేదా?

ధర్మం — అతిథికి భోజనం పెట్టడం కూడా ఒక తప్పే అంటావా?

లోభం — తప్పా? తప్పున్నర కూడానా? ఆతని యీ బాధకు కారణం కూడా నీవే కదా?

ధర్మం — నేనేమి చేశాను?

లోభం — నీవు ప్రోత్సహించకపోతే అతడు అతిథికి భోజనం పెట్టివుండడు. అప్పుడు అతని సొమ్ముకు తరుగు వుండదు. అతిథిని గౌరవించడంవల్ల ఏర్పడిన ఆ తరుగును పూరించడానికే కదా, నేను అతన్ని యీ రాత్రి పస్తు పడుకోబెట్టవలసి వచ్చింది?

ధర్మం — అయితే నేను చేసింది తప్పంటావా?

లోభం — నీవు చేయవలసింది నీవు చేశావు. నా ధర్మాన్ని నేను నెరవేర్చుకున్నాను. ఇందులో యెవరి తప్పూ లేదు.

ఆ సంభాషణ వింటూ వున్న లోభికి — తాను స్వభావ విరుద్ధంగా ప్రవర్తించినందువల్లనే తనకు ఈ బాధ కలిగిందని తెలిసింది. భగవంతుడు ఏ వ్యక్తికయినా, ఎంత ప్రాప్తమో అంతే లభింప చేస్తాడనీ, వ్యక్తి స్వతంత్రించి యేమి చేద్దామనుకున్నా, అది యెంతమాత్రమూ సాధ్యపడేది కాదనీ ఆ లోభికి బాగా బోధపడింది. ●



# రాధికా పరిణయం

'చూసిన వాళ్ళందరూ ఆ కాలేజీకి బ్యాటికింగ్ గోపాలక్రిష్నే నంటారు. బి. కామ్ ఫైనలియర్ చదువుతున్న అతనంటే చిన్నా, పెద్ద పడి చస్తారు ఆ కాలేజీలో... ఒక్క కాలేజీమిటి ? ఆ ఊరి కాలేజీలన్నిటిలోని అందరు స్టూడెంట్స్ అతన్ని లైక్ చేస్తారంటే, అతిశయోక్తి కాదు. అతను అందంలోనే కాక చదువులోను, సంపదలోను అన్నిట్లోనూ కింగే! అతనికి తగిన బ్యాటిక్వీన్ ఏ కాలేజీలోనూ కనిపించక, వెదికి, వెదికి విసిగిపోయారతని ఫ్రెండ్స్. డిమాన్‌స్ట్రేటర్స్ దగ్గర్నుంచి,



ప్రిన్సిపాల్‌వరకు అతన్ని మెచ్చుకుని, 'కాలేజీకి మకుటం లాంటివాడు' అని అనకుండా ఉండలేకపోయారు. పద్మశ్రీ, పద్మభూషణ్‌లాగ చదువులో అతనికి 'విద్యశ్రీ' బిరుదివ్వచ్చు అంటారందరూ! అతన్ని చూసినవారందరూ లక్ష్మీ, సరస్వతి ఒకచోట ఉండరన్న వాదాన్ని టక్కున ఖండిస్తారు. మూడేళ్లనుంచి కాలేజీ స్టూడెంట్స్ యూనియన్ సెక్రటరీగా అతన్నే ఏకగ్రీవంగా ఎన్నుకుంటూ వచ్చారు. అతని కారులో అరడజను మందికి తక్కువ జనం ఎప్పుడూ ఉండరు. కాలేజీ నిత్యకల్యాణం, పచ్చతోరణంగా కలకలలాడటానికి కారణం అతనేనని అందరి నమ్మకం!'

'ఇంక ఆపు తల్లీ! గోపాలక్రిష్ణ స్తోత్రం' అంది చిరాగ్గా రాధిక ఒడిలో పుస్తకం గట్టిగా క్రింద పడేస్తూ.

ఈ హఠాత్పరిణామానికి అదిరిపోయినా పైకి కనిపించనీకుండా గొంతు సవరించుకుని మళ్ళీ మొదలుపెట్టింది ఉమ. 'కాని, పాపం! ఇప్పుడందరికీ ఒకటే విచారం!' అంది సీరియస్‌గా.

పచ్చికలో వెల్లకిలా తలక్రింద చేయి పెట్టుకుని పడుకున్న రాధిక, ఈమాటలకు కలవరపడింది. అప్పుడే విసుక్కుని ఉండటం వలన మౌనం వహించింది. అదేదో తెలుసుకోవాలనే కుతూహలం ఆమె కళ్ళలో ప్రతిబింబించటం చూసి, కొంటెగా నవ్వింది ఉమ. కోపంగా చూసింది రాధిక. 'ఎందుకలా ఉడికిపోతావ్‌గాని చెప్తా విను! సకల కాలేజీ జీవరాసుల విచారంబునకు కారణంబైన వృత్తాంతం బెట్టిదనిన, కాలేజీలకు రాజైన ఆ రాజకుమారుడు. ఈ సంవత్సరాంతంబున, అనగా పై సంవత్సరారంభములో ఫారిన్ వెళ్ళబోతున్నాడట! అందుకని...'

ఈ వానరసైన్యం ఇప్పట్నించే విచారాంబుధిలో మునిగిపోయారు, అదే...మొన్న వరదల్లో క్రిష్ణాజిల్లా మునిగినట్లు' అంది ఎగతాళిగా రాధిక.

'నిన్నగాక మొన్నొచ్చావ్, అతనంటే అలా మండిపడతావెందుకు? అతని గురించి ఏం తెలుసని అలా చిరాకు పడతావ్? తర్వాత నీవే విహరించాల్సి వస్తుందమ్మాయ్, జాగ్రత్త!' బెదిరించింది ఉమ.

'నేనెలా ఉంటే నీకేంగానీ, పోనీ నీకు తెలుసుగా? అతని గురించి? అదంతా ఓ పెద్ద గ్రంథం రాసి 'గోపాలక్రిష్ణోపాఖ్యానం' అని పేరుపెట్టు.'

'ఓ...తప్పకుండా రాస్తాను. రాసి నీకే అంకితమిస్తాను'

'ఊఁ...సరే ఇక్కడే, ఇప్పుడే మొదలుపెట్టు, నే వెళ్తున్నా!' అంటూ విసురుగా లేచి నిల్చుంది.

'ఇదుగో! నేనూ వస్తున్నానండీ రాణీగారూ! మరీ అంతకోపమయితే ఎలా?'

'ఇదుగో అమ్మాయి, ఈసారి నుండి, రాణీ, కాణీ అన్నావంటే తంతాను జాగ్రత్త!' ఉరిమి చూసింది స్నేహితురాలిని.

'అదేదో సినిమాలో విజయనిర్మల లాగ నీకూ స్టంటు వచ్చా?' అని నవ్వుతూ 'అయితే అందరూ ఎదురు చూస్తున్న హీరోయిన్ దొరికినట్లే' అంది ఏదో ఆలోచిస్తున్నట్టు.

'ఇదే లాస్ట్ వార్నింగ్, పిచ్చి పిచ్చిగా మాట్లాడకింక! లేకపోతే ఇదే లాస్ట్ వర్డ్ అండ్ లాస్ట్ డే నీతో మాట్లాడడం — నీతో ఉండటం!' అంది సీరియస్‌గా గబగబా అడుగులువేస్తూ.

'అలాగే కానీ! ఇంక ప్రశాంతంగా ఉండు. అందరూ మనల్నే చూస్తున్నారు. పోట్లాడుకుంటున్నా మనుకుంటారు' ఆమె చేయి మెల్లగా నొక్కింది ఉమ.

ఉమ ఎక్కగానే స్టీరింగ్ ముందు కూర్చుని కోపంతో డోర్ గట్టిగా లాగింది. ఆ శబ్దానికి ప్రక్కనే ఆగిన కారులోంచి ఇప్పుడే దిగిన ఇద్దరబ్బాయిలు, ఉమ ఉలిక్కిపడ్డారు. 'ఈతీరున నీ కారు ఎన్ని నెలలు వస్తుందంటావ్?', అంది సీరియస్‌గా ఉమ. తన కోపానికి నవ్వుకుంది రాధిక.

* * *

నిజానికి రాధికది, ఉమది విశాఖపట్టణం. ఇద్దరిళ్ళు ప్రక్క ప్రక్కనే అవటంవలన, వయసులోను, చదువులోను ఒక్కటె కావటం వలన ఇద్దరూ ప్రాణస్నేహితులయ్యారు పి. యు. సి. పరీక్షలు అయిన తరువాత సేల్స్‌టాక్స్ ఏజంటుగా పని చేస్తున్న ఉమ తండ్రికి హైదరాబాద్ బదిలీ కావటంతో ఇద్దరూ విడిపోక తప్పలేదు. మనుషులు వేరైనా, మనసులు ఒకటిగా ఏడాది గడిపేశారు. మరుసటి సంవత్సరమే డిస్ట్రిక్ట్ కలెక్టర్ చేస్తున్న రాధిక తండ్రికి కూడా హైదరాబాద్ ట్రాన్స్‌ఫరయింది. ఇద్దరి ఆనందానికి అవధులు లేకపోయింది.

రాధిక — ఒకటే సంతానం; తరగని ఆస్తి ఉండటంవలన అడక్కముందే అన్నీ అందిస్తూ అల్లారు ముద్దుగా పెంచారు ఆమె తలిదండ్రులు. చదువులో కంపేరేటివ్ డిగ్రీలో వున్నా అందంలో సూపర్లేటివ్ డిగ్రీలో ఉంటుంది. ఆమె నడకలో, నవ్వులో, మాటల్లో గర్వం తొంగి చూసినా ఆమె మనసు చాలా మంచిది— అంటారు తెలిసినవాళ్ళు. నిజం కూడా అదే! కాని ఆమెకు కోపం పిలవని పేరంటంలా వచ్చేస్తుంది. ప్రాణ స్నేహితులైన వాళ్ళిద్దరికీ అన్నిట్లోనూ కొంచెం డిఫరెన్సు కనిపిస్తుంది చూసిన వాళ్ళకు. ఆమెకు అందంలో ఉన్న డిగ్రీ ఈమెకు చదువులోనూ, చదువులో ఉన్న డిగ్రీ అందంలోనూ ఉంటుంది. లోకం పోకడ తెలిసిన ఉమ సహజంగానే శాంతస్వభావురాలు. రాధికది దీనికి పూర్తిగా కాకపోయినా ఎక్కువగానే విరుద్ధ స్వభావం. ఆమెకు కోపం వస్తే చేతిలో ఉన్నదేదైనా గట్టిగా విసిరేస్తుంది. 'రేపు వచ్చే నాధుడుకూడా నీలా కోపిష్టి అయితే మీ యింట్లో వస్తువులన్నీ వీధిలో ఉంటాయన్న మాట' అంటుంది స్నేహితురాలిని ఏడిపించటానికి. 'పోనీలే! నీవు ఉన్నావుగా ఏరి పెడుదువుగాని'. 'మళ్ళీ ఏరి అందించనా?' అనగానే ఎంత కోపంలో ఉన్నా నవ్వేస్తుంది రాధిక.

* * *

సెకండ్‌అవర్ అయిపోవస్తోంది ఫైనల్ బి. కామ్ క్లాసులోంచి ఎక్కౌంట్స్ లెక్చరర్ బయటికి వెళ్ళిపోయాడు. 'గోపాలక్రిష్ణగారిని ప్రిన్సిపాల్‌గారు రమ్మంటున్నారు' అన్నాడు గడపలో నిల్చుని ఆఫీసు ప్యూన్. శ్రీరామ్‌తో బయలుదేరాడు గోపాల్. శ్రీరామ్, గోపాల్‌కి అత్యంత స్నేహితుడు. ఇంటా బయటా కూడా! ప్రిన్సిపాల్‌రూమ్ ఆ బిల్డింగ్‌కి చాలా దూరంగా ఉంటుంది.

'ఎందుకు పిల్చారంటావ్?' అన్నాడు సందేహంగా గోపాల్.

'ఏముంది, కాలేజీ రీఓపెన్ అయిందిగా' ఏదైనా మీటింగు ఉందేమో సాయంత్రం?

'అదే అయిఉంటుంది!' అన్నాడు వాళ్ళ వైపే వస్తున్న ఇద్దరి స్టూడెంట్స్‌ని చూస్తూ. వాళ్ళిద్దరూ బి. యస్. సి. సెకండియర్ స్టూడెంట్స్. 'ఏమండీ! ఈ పర్స్ లేబరేటరీలో మర్చిపోయారు వాళ్ళు' అన్నారు అటువైపు చూస్తూ. లాస్ట్ అవర్ ఖాళీ అవటంవలన ఇంటికి బయలుదేరారు రాధిక, ఉమ.

'ఎవరిదో తెల్సుగా, మీరే ఇవ్వరాదూ?' అన్నాడు గోపాల్.

'వద్దు మీరే ఇవ్వండి. ఇందాక లేబరేటరీలో మేమే కావాలని దాచేశాం అనుకుంటారు' అన్నారు బతిమాలుతున్న ధోరణిలో. వాళ్ళ భయానికి నవ్వుకుని 'సరే ఇలా ఇవ్వండి!' పర్సు తీసుకుని గబగబా నడవటం మొదలుపెట్టారు.

'క్రొత్తగా వచ్చిన ఆ రాధికంటే చాలా మందికి భయం!' అన్నాడు శ్రీరామ్ నవ్వుతూ.

'ఎందుకని?!'

'ఆమె సత్యభామకు ప్రతిరూపం. ముఖ్యంగా స్వభావంలో!

'నీకెలా తెలుసు అప్పుడే?'

'నిన్న ఉమ చెప్పిందిలే!'

'ఏదేం, మీ ఇద్దరు మాట్లాడేసుకుంటున్నారా?'

'తన అవసరంగా మరి. బాగానే మాట్లాడుతుంది' నవ్వాడు శ్రీరామ్.

'తన అవసరమేమిటి?' అర్థంకాక తికమక పడ్డాడు గోపాల్.

జవాబు ఇవ్వకుండానే 'అటు చూడు!' అన్నాడు శ్రీరామ్, కారు కీస్‌కోసం పర్స్ తీయబోయి 'అమ్మో! నాపర్స్' అంది రాధిక గబుక్కున వెనక్కితిరిగి వెదుకుతూ. 'ఏమండీ! ఇదిగో మీ పర్స్!' అందించాడు గోపాల్. 'మేనీ థాంక్స్!' అనుమానంగా చూస్తూ పర్సు తీసుకుని తిరిగి చూడకుండా కారుదగ్గరికి నడిచింది. శ్రీరామ్‌నిచూసి నవ్వి ఏదో సైగ చేసింది ఉమ. కారు లాక్‌తీస్తున్న రాధిక అది గమనించలేదు.

'అంతకోపమైతే నేనెంత బాధపడతానో తెలుసా?' సైకిల్‌మీద పాడుకుంటూ ప్రక్కనించి వెళ్ళాడో కొంటెకుర్రాడు. ఒక్కసారి కోపంగా వెనక్కితిరిగిచూసి స్టీరింగ్ ముందు కూర్చుని డోర్ విసురుగా లాగి



వేసింది. ఆ విసురుకు అదిరిపడిన శ్రీరామ్ ఆ రోజుకూడా ఈమెకారే అయి ఉంటుంది అన్నాడు సాలోచనగా. 'ఏరోజు?' అన్నాడు గోపాల్, 'అదే ... పార్కుదగ్గర గుర్తులేదూ' 'ఆ...అవును గుర్తొచ్చింది. సత్యభామ!' అన్నాడు నవ్వుతూ.

'ఎందుకే అంతకోపం? వాళ్ళేం చేశారని, దొరికితే తీసుకువచ్చి ఇవ్వటంకూడా తప్పేనా? ఎక్కడ దొరికిందని మాట వరసకైనా అడిగావా? నిర్లక్ష్యం అనుకోరూ?' అంది ఉమ మందలిస్తున్నట్లు. 'అనుకోనీ! అన్ని బిరుదులతోపాటు ఇదికూడా!' చిరాగ్గా ఉంది.

'మీ పేరెంట్స్, పొరపాటున రాధిక అని పెట్టారుకాని 'సత్యభామ' అని ఉండాల్సింది.'

'అప్పుడు నీవు రుక్మిణివి! అప్పుడేంటి ఇప్పుడు, ఎప్పుడూ రుక్మిణివి: సరేకాని సాయంత్రం షికారుకి పోదాం వస్తావా?'

'ఎందుకు పోట్లాడుకోటానికా?' నవ్వుతూ ఉమ.

'నీవేమీ అనందే నేనెందుకు పోట్లాడతాను?

'అవును మరి! నీవు బోలెడు మంచిదానివి!'

'అవునట! మమ్మీ, డాడీకూడా ఈమాటే అంటారు' అంది అమాయకతను నటిస్తూ. ఆమె జాణతనానికి నవ్వుకుంది ఉమ. 'పార్కుకి వెళ్దామన్నావుగా? తప్పకుండా రావాలి, ఒక్కగంటలో!' కారు దిగుతూ హెచ్చరించింది.

పబ్లిక్ గార్డెన్స్‌ముందు కారు పార్కు చేయబోతున్న రాధిక ప్రక్కనే ఆగి ఉన్న గోపాల్ కారుని చూసి తిరిగి స్టార్టు చేసింది. తన ప్రయత్నం విఫలమైనందుకు కోపమొచ్చింది ఉమకు. అయినా, పైకి కనిపించనీకుండా 'ఎందుకు? మళ్ళీ వెనక్కు త్రిప్పావు? 'ఉమకు నిజంగా తెలియదనుకుని 'ఈ రోజు టాంక్‌బండ్ మీదకు పోదాం!' అంది.

'పరీక్షలు వస్తున్నాయి. లాస్టియరంతా హేపీగా తిరిగినా ఈసారి పబ్లిక్ కదా! కష్టపడి చదివితేకాని పాసవలేం!' అంది ఉమ తనలో తను అనుకుంటున్నట్లుగా.

'అంటే, ఇకపై షికార్లు వద్దనా? అర్థం?' కనుబొమ్మలు కొద్దిగా ముడిచి ఓరగా చూసింది.

'అదుగో ఆ కోపమే వద్దనేది, రేపు వచ్చేవాడు...'

'షటప్!' కోపంతో కళ్ళెర్రచేసి చూసింది.

'శాంతించు దేవి, శాంతించు! నీ కోపాగ్నిలో భస్మం చేయకు! ఈ భూమి మీద నేను నెరవేర్చవలసినవి ఇంక చాలా ఉన్నాయి. ముఖ్యంగా నీ పరిణయం విషయంలో' అంది పక్కా భక్తురాలి పోజులో చేతులు జోడించి. ఆమె మాటలకు కోపం మరిచిపోయి నవ్వేసింది. 'నా పెళ్ళి విషయంలో నీకంత శ్రమ ఎందుకులే' నీది నీవు చూసుకుంటే చాలు!'

'అయితే, నీవు ఇదివరకే చూసుకున్నా వన్నమాట, ఇంత స్నేహితురాలినికదా? నాతో మాట మాత్రమైనా చెప్పలేదే మరి! ఇంతకీ ఆ అదృష్టవంతుడెవరో చెప్పు, అతనికి నీ గురించి కొన్ని విషయాలు, నీతో ఉన్నప్పుడు ఆచరించవలసిన జాగ్రత్తలు నేర్పాలి,' కొంటెగా నవ్వింది.

'అల్లరిపిల్లవైపోయావు, ఈ నీళ్ళ బాగా వంట బట్టినట్లున్నాయే?'

'ఆ...అవును, నీకూపడితే కోపం తగ్గిపోతుందేమో!

'మాటల్లో నీతో గెల్వలేను బాబూ!' కారు ఒక్క కుదుపుతో ఆగింది.

'పోనీ స్టంటుచేసి చూద్దామా? ఎవరు గెలుస్తారో? నవ్వింది రాధిక ...'

టాంక్‌బండ్ వచ్చేపోయే జనంతో రష్‌గా ఉంది. ప్రశాంతంగా ప్రవహిస్తున్న హుసేన్‌సాగర్‌ని చూస్తూ నిల్చున్నారు. చాలాసేపు ఇద్దరిమధ్యా నిశ్శబ్దం రాజ్యం చేసింది.

'అబ్బ! ఎలా, మాట్లాడుకోటానికేమీ దొరకటంలేదు?' ఉన్నట్లుండి అంది ఉమ. నవ్వుకున్నారిద్దరూ. ఉమ వచ్చేసిన తరువాత విశాఖలో తనెలా గడిపింది, బి. యస్. సి. ఫస్టియర్‌లో ఎంతమంది స్నేహితులైంది చెప్పింది రాధిక. నెలరాజు చిరునవ్వుతో పలకరిస్తున్నాడు. ఆ పలకరింపుకు సంతోషంతో మిలమిల మెరిసిపోతోంది హుసేన్‌సాగర్.

# ఆ స్వచ్ఛమైన మనోహరమైన తెల్ల తనానికి




లయన్ బ్రాండ్

## విక్టోరియా బ్లూ ఒ ఒ బి (OOB)

(ప్రశస్తమైన ముదురు నీలం)

అవును, కొంచం విక్టోరియా బ్లూ ఒఒబి మీ తెల్ల బట్టలకు అద్భుతమైన ప్రత్యేకత నిస్తుంది! వాటికి మిలమిల్లు కొలిపే తెల్ల తనాన్ని చేకూర్చుతుంది. మీ చొక్కాలకు, చీరెలకు, దుప్పట్లకు ఆటీవచ్చే విధంగా అదనపు తెలుపునిచ్చే పద్ధతి!



తయారుచేయువారు: అల్ట్రామరైన్ అండ్ పిగ్మెంట్స్ లిమిటెడ్ అంబత్తూర్, మద్రాస-53.

సోల్ సెల్లింగ్ ఏజంట్సు: కెమ్ లైన్ ట్రేడింగ్ కంపెనీ, 318, లింగి చెట్టి స్ట్రీట్, మద్రాసు-1.

సోల్ సెల్లింగ్ ఏజెంటు: కెమ్‌లైన్ ట్రేడింగ్ కంపెనీ, 318, లింగిచెట్టి వీధి, జి. టి. మద్రాసు.

డిస్ట్రిబ్యూటర్లు: మెసర్స్ ఎస్. రామన్‌లాల్ బ్రదర్స్., 416, మింట్ వీధి మదరాసు—1.

'ఇంక పోదామా, చీకటిపడుతోంది!'

'సరే పద!'

*      *      *

పదికావస్తోంది. మార్చినెల కావటంవలన ఎండ తీక్షణంగానే ఉంది. సడన్ బ్రేక్‌తో ఆగింది కారు హారన్ విని పుస్తకాలు సర్దుకుంటూనే పరుగునవచ్చింది ఉమ. స్టీరింగ్ ముందు డ్రైవర్‌ని చూసి బాక్ సీట్లో కూర్చున్న రాధికవైపు ప్రశ్నార్థకంగా చూసింది.

'కారుకి రిపేర్‌వర్క్ ఉందిట, మనం వర్క్‌షాపుదగ్గర దిగి రిక్షాలో పోదాం!'

'రిక్షాలో ఎందుకు? మన బస్సులో పోదాం!

'చచ్చా బాబూ! సీట్ లేకపోతే బోయిస్‌తో పాటు నిల్చుని ప్రేలాడలేక చావాలి!

'సరేగాని, సాయంత్రం మా పెద్దమ్మగారింటికి వెళ్తాం వస్తావా? లేకపోతే నీ ఒక్కదానివే వెళ్లిపో! నేను రిక్షాలో వెళ్లివస్తాను. ఈ సంవత్సరం ఇంతవరకు ఒక్కసారికూడా వాళ్లింటికి వెళ్లలేదు'

'సాయంత్రం కారుకూడా లేదు. ఒక్కదాన్ని ఎలా వెళ్లటం! పోనీ నేనూ వస్తాలే!'

'ఆల్‌రైట్, యు ఆర్ ఎ గుడ్‌గర్ల్!' తన మాటకి ఒప్పినందుకు సంతోషంతో గబుక్కున ఆమె బుగ్గమీద ముద్దుపెట్టుకుంది. 'మళ్లీ మాట తప్పకూడదమ్మాయ్!' సరేనన్నట్లుగా తల ఊపింది రాధిక.

శ్రీరామ్‌కోసం ఎదురుచూస్తూ లాన్స్‌లో వేసిన కుర్చీలలో కూర్చుని ఇంగ్లీష్ ప్రోజ్ చదువుకుంటున్నాడు గోపాల్. గేటు శబ్దానికి తలెత్తి చూసి ఆశ్చర్యపోయాడు.

'హల్లో! ఏమిటి మాపై ఇన్నాళ్లకి దయ కలిగింది' అంటూ ఆహ్వానించాడు రాధికా ఉమలను.

'సరేగానీ, పెద్దమ్మ ఉందా అన్నయ్యా?' అంది టీపాయ్‌మీద పుస్తకాలు పడేస్తూ.

'పెద్దమ్మైతే ఉంది కాని నీవు వెదుకుతున్న చెలికాడు మాత్రం లేదు! అన్నాడు ఆమె చూపులను గమనించి నవ్వుతూ.

'ఛీ...పో, అన్నయ్యా!' అందుకే మీ యింటికిరానిది!' అంటూ లేడిలా లోపలకు పరుగెత్తింది. రాధికకి ఉమమీద చచ్చేంత కోపంవచ్చింది. పెద్దమ్మ అంటే ఎవరో అనుకుంది కాని ఈ మహానుభావుడుంటా



డని తెలిస్తే అసలు వచ్చేదేకాదు. పెద్ద స్నేహితురాలిలా నటిస్తుంది కాని ఇంతోటి అన్నయ్య ఉన్నాడని చెప్పి ఏడిస్తేగా! సస్పెన్స్‌లో పెట్టి తీసుకొచ్చిందిగాక, ఇక్కడే వదిలేసి పోయింది. ఈ పిల్లతో ఇంకెక్కడికీ పోకూడదు. 'డామ్ ఇన్సల్ట్...తిరిగి వెళ్లిపోదామంటే ఈ మహానుభావుడు ఇటే వస్తున్నాడు.' కసిగా క్రిందిపెదవిని కొరుక్కుంటూ నిలబడింది.

'నమస్తే! కూర్చోండి' అన్నాడు గేటు వేసి వస్తూ.

'థాంక్స్! నేను వెళ్తున్నాను. ఉమతో చెప్పండి' అంది వెనుతిరుగుతూ.

'అరె, అదేమిటండీ! ఉమమీద కోపం నామీద చూపిస్తారే! మీ స్నేహితుడిగా అడుగుతున్నాను. ప్లీజ్! సిట్‌డౌన్!' మృదువుగా పలికిందతని కంఠం. సంశయిస్తూ అలాగే నిలబడిందామె,

లైట్ గ్రీన్ ఫుల్‌వాయిల్ చీర. డీప్ గ్రీన్ రూబీ లాన్ బ్లౌజు. మెడలో సన్నని లాకెట్ చైన్. చెవులకి డైమండ్ రింగులు కుడిచేతికి రెండు బంగారు గాజుల మధ్య రెండు ఎర్ర మట్టిగాజులు. ఎడం చేతికి ముద్దొస్తున్న చిన్న స్క్వేర్ వాచీ ధరించింది. నల్లని నొక్కుల జుట్టు. ఫాలభాగంపై నాట్యమాడుతున్న అల్లరి ముంగురులు, పొడవైన వాలుజడలో కనకాంబరాలు ఆమె వదనంలాగే వాడి ఉన్నాయి. క్రిందికి వాలి ఉన్న అందమైన కళ్లు భయంతో కాబోలు చంచలంగా కదులుతున్నాయి. మంచులో తడిసిన గులాబీ రేకుల్లాంటి పెదవులు కోపంతో కొద్దిగా కంపిస్తున్నట్లున్నాయి. ఒక చేతిలో హృదయానికి దగ్గరగా పెట్టుకున్న బుక్స్, రెండోచేయి ముందున్న కుర్చీ మీద వేసి నిల్చుని 'దివినుండి దిగి వచ్చిన మెరుపు తీగేమో' అనిపిస్తున్న ఆమెను ఒక్క క్షణం రెప్పలార్పకుండా చూశాడు.

'పోనీ, నేనటు వెళ్తాను. మీరు వచ్చి కూర్చోండి.'

బయటపడి పోయినందుకు అభిమాన పడుతూ 'ఊహూఁ...అదేం లేదు' అంటూ గబుక్కున ముందుకు వచ్చి కుర్చీలో కూర్చుంది. చదువుతూ ఆపేసిన పేజ తెసి చదవటం మొదలుపెట్టాడు. 'ఏమీ మేనర్స్ తెలియదు ఎదురుగా మనిషి ఉన్నా తనే పెద్ద చదువుతున్నట్లు ఫోజు కొడుతున్నాడు అవును మరి—పాపం! క్లాస్ రావాలి, ఫారిన్ వెళ్లాలి! గతి లేక కూర్చున్నట్లు నేనెందుకిక్కడ? ఇదంతా ఆ పొడుపిల్ల మూలంగా వచ్చింది.' మనస్సులో వంద ఆలోచనల్తో చిరాగ్గా కూర్చుంది. అందమైన చిన్న చిన్న రంగుల పూలు చిరుగాలికి తల లూపుతూ ఆహ్వానిస్తున్నాయి. గులాబి సగం వాడి నీరసంగా నవ్వుతోంది. అప్పుడే విరుస్తున్న నైట్‌క్వీన్, సన్నజాజి, మల్లి, చైనా బాక్స్ తీయని పరిమళాన్ని వెదజల్లుతున్నాయి. లాన్స్‌కి కొంచెం దూరంలో ఫౌంటెన్ రంగునీళ్లను చిమ్ముతోంది. చుట్టూ ఎత్తుగా ఉన్న ఫౌంటెన్ గోడమీద నాలుగు వైపులా ఒకే భంగిమలో నిల్చున్న అందమైన శిల్పాలు, పైకెత్తిన వాటిచేతుల్లో క్రింద నీటిలో ప్రతిబింబించేట్లు అమర్చిన లైట్స్— కాంపౌండ్ వాల్‌కి కొంచెం ఇవతలగా స్విమింగ్ పూల్, దాని చుట్టూ అందంగా కత్తిరించిన ఫెన్సింగ్— నిశ్శబ్దంగా అన్నిటినీ పరికిస్తున్న ఆమె కళ్లు అటు పక్కకు వచ్చి ఆగిపోయాయి.

గాలికి జుట్టు కొద్దిగా రేగి, విశాల ఫాలంపై పడుతున్న రెండు, మూడు రింగ్స్, ఎత్తయిన క్రాప్, పట్టుదల కార్యదీక్ష ప్రతిఫలిస్తున్న కళ్లు, నవ్వుతూ ఆగిన ట్లున్న పెదవులు, లైట్ బ్రవున్ టెర్లిన్ శ్లాక్, వైట్ టెరీకాటన్ టైట్‌పాంట్, పాయింటెడ్ బ్లాక్ షూ, సాక్స్ — ఎడం చేతికి రేడియం డయల్ వాచీ, కుడి చేతిలో పుస్తకం. కాలేజీలో చేరకముందు ఉమ వర్ణించిన రాజకుమారుడు గుర్తొచ్చి చిన్నగా నవ్వుకొంది.

'కోపం పోయినట్లుందే — నవ్వుకుంటున్నారు?' అన్నాడు పుస్తకం టీపాయ్ మీద పడేస్తూ. ఆ పుస్తకం తగిలి ఉమ పుస్తకాలు ప్రక్కగా కిందపడ్డాయి. చటుక్కున ఒకేసారి వంగిన ఇద్దరి తలలు 'ఢీ'కొట్టుకున్నాయి. గుండె ఝల్లుమనగా గబుక్కున లేచి సరిగా కూర్చుంది. గోపాల్ పుస్తకాలు తీసి టీపాయ్‌మీద పెట్టాడు సిగ్గుతో వాలిపోయిన ఆమె వదనాన్ని చిరునవ్వుతో తిలకిస్తూ కూర్చున్నాడు.

'ఏమిటి మౌనంగా కూర్చున్నారు? మాటలు మర్చిపోయారా? లేక వాటి అవసరం లేదా?' అంటూ వచ్చాడు శ్రీరావ్.

తడబడుతూ చూపులను ఆమె నుండి మరల్చుకుని శ్రీరావ్ వైపు చూశాడు గోపాల్.

'ఉమేది?'

'లోపలికెళ్ళింది, ఇంకా ఎంతసేపటికీ ఊడిపడదే?'

'పిలుచుకొస్తా నుండండి,' అంటూ లోపలికి పరుగెత్తాడు శ్రీరావ్.

'అల్లరిపిల్లడు' అన్నాడు నవ్వుతూ 'ఉమకూడా ఇంతే, ఇద్దరికీ సరిపోయింది జోడు'

'ఏమిటన్నారు' అంది ఉలిక్కిపడి సర్దుకుంటూ.

'ఏం లేదు ఉమ మీకేమీ చెప్పలేదా? నమ్మలేనట్లు అడిగాడు. లేదన్నట్లు తల ఊపింది'

'వీళ్ళిద్దరికీ పరీక్షలవగానే పెళ్ళి జరుగుతుంది. అప్పటివరకు కలుసుకోకూడదని మాట్లాడుకోకూడదని రూల్ పెట్టింది ఉమ. శ్రీరావ్ ఎప్పుడూ నాతోనే ఉంటాడని ఇక్కడకు రావటంకూడా మానేసింది. కాని ఇంతవరకు...

'అదుగో అన్నయ్యా, చెప్పేశావ్ కదూ? ఆడవాని నోట్లో నువ్వుగింజ నానదంటారు కాని నీ నోట్లో దానిలో హాఫ్ కూడా నానదు.' అంటూ వచ్చింది ఉమ వాళ్ళ పెద్దమ్మతో కలిసి. 'ఆవిడక్కూడా అందంగానే ఉన్నారు?' అనుకుంది రాధిక. డ్రింక్స్ ఉన్న ట్రే టీపాయ్ మీద పెడుతూ పెద్దమ్మని పరిచయం చేసింది. లేచి నిల్చుని 'నమస్తే!' అంది చేతులు కలిపి. 'కూర్చోమ్మా!' అంటూ శ్రీరావ్ కి గోపాల్ కి మధ్య చైర్ లో కూర్చున్నారావిడ. అందరికి డ్రింక్స్ ఆఫర్ చేసి తనొకటి తీసుకుని స్నేహితురాలి ప్రక్కన కూర్చుంది ఉమ. తండ్రితో ఎన్నిసార్లు క్లబ్బులకి హోటల్స్ కి వెళ్ళినా గోపాల్ ఎదురుగా త్రాగటానికి భయపడుతూ ఎలాగో పూర్తి చేసింది రాధిక.

కాసేపు అవీ ఇవీ మాట్లాడి 'వస్తుందమ్మా! మీరు మాట్లాడుకుంటూ ఉండండి అంటూ లేచి వెళ్ళిపోయారావిడ. 'వంటావిడ కూరల్లో కారాలవీ ఎక్కువ వేస్తే, వాళ్ళ ముద్దుల కుమారుడు తినలేక పోతాడని భయం మా పెద్దమ్మకి' అంది ఉమ. తలెత్తి చూడబోయిన రాధిక నవ్వుతూ తనవంక చూస్తున్న గోపాల్ ని చూసి చటుక్కున మరోవైపుకు త్రిప్పుకుంది చూపులను.

'రేపు ఆదివారంగా? ఏదైనా పిక్చర్ కి వెళ్దాం. ఈ సంవత్సరమంతా నీ పుణ్యమా అంటూ సినిమాలే లేకుండా చేశావ్!' అన్నాడు శ్రీరావ్ ఉమతో.

'నాకు తెలీదనుకున్నారు కాబోలు పాపం! వైజయంతిమాల సినిమాలు ఎన్ని చూసిందీ, ఎన్నిసార్లు చూసిందీ?'

'అందుకే, షమ్మీకపూర్ సినిమాలన్నీ మిగిలిపోయాయి' ఉక్రోషంగా అన్నాడు.

'ఇదుగో, మిష్టర్! నాతో మాట్లాడకింక. పరీక్షలు దగ్గరకు వస్తున్నాయి. సినిమా గినిమా నై...'

'నీ యిష్టమైనప్పుడు మాట్లాడతాననుకున్నావా? అయితే సరే! నేనా నాటకంలో యాక్టు చేయను ఇకమీద.' నవ్వాడు శ్రీరావ్.

వారి కూటలు అర్థంకాక అయోమయంగా చూశారు రాధిక, గోపాల్.

ఇంక పోదామన్నట్లుగా ఉమ చేయి నొక్కింది. 'ఇంక వెళ్తాం అన్నయ్యా! వెళ్తున్నాం!' అంది శ్రీరావ్ వైపు చూడకుండా. గోపాల్ కారు గారేజీలోంచి తీయటానికి వెళ్ళాడు. పెద్దమ్మతో చెప్పి వస్తానంటూ వెళ్ళిపోయి ఎదురు వస్తున్న ఆమెను చూసి ఆగిపోయింది. ఆమెన్ను చూసి ఏమనలేక అయిష్టంగానే కారెక్కింది రాధిక, కారులో ఉన్నంతసేపూ స్టీరింగ్ ప్రక్కనున్న అద్దంలో తన ప్రతిబింబాన్ని గోపాల్ చూపులనుండి తప్పించలేక అవస్థ పడింది. ఇంటిముందు కారాగగానే దిగి ఉమతో మెల్లిగా 'మీ అన్నయ్యకు థాంక్స్ చెప్పు!' అంటూ అప్రయత్నంగా అటుచూసిన ఆమె కళ్ళకు 'నో థాంక్స్!' చెప్పా యతనికళ్ళు.

'ఏమో అనుకున్నాగాని పాపం! మంచి వాడులానే ఉన్నాడు!' అనుకుంది రాత్రి పడుకోబోతూ.

'అంత గడుసుపిల్లకి నన్ను చూడగానే సిగ్గూ, భయం ముంచుకొచ్చాయెందుకో?' అనుకున్నాడు తెట్టు తీసి ప్రక్కమీద వాలుతూ గోపాల్.

'ఇంక రేపటినుండి రాధికలో మార్పును గమనించాలి. ఏమో, మొండిఘటం! అసలేమైనా మాట్లాడిందో లేదో అన్నయ్యతో. శ్రీరావ్ నిజంగానే ఉండనంటే నేనొక్కదాన్నే నడిపించగలనా ఈ నాటకం?' అనుకుంది ఉమ పుస్తకం మూసేస్తూ.

* * *

'వచ్చినంత హడావుడిగానూ వెళ్ళిపోయాయి పరీక్షలు. సినిమా ప్రోగ్రాం వేశాడు శ్రీరావ్. ఎంత బతిమాలినా రాధిక రానంది. 'ఇదుగో, అమ్మాయి! ఆ



రోజునుండి చూస్తున్నా. అదే! మా పెద్దమ్మ గారింటికి వెళ్ళినప్పటినుండి ఏదోలా ఉంటున్నావు! కోపంకూడా ఇదివరకులా పిలవనిదే రావటం లేదు. కొంపదీసి ఇదంతా మా అన్నయ్య మహత్యం కాదుగదా?' చిలిపిగా అడిగింది ఉమ. ఉమచేతిని మృదువుగా తోస్తూ, ముఖం ప్రక్కకు తిప్పుకుని నవ్వుకుంటూ 'ఛీ, ఫో...మరీ చిలిపిదానివై పోతున్నావు!' అంది రాధిక. 'అలాగే పోతా గానీ ఇంతకీ నీవు రావా?' తల అడ్డంగా ఊపింది. గోపాల్ ఎలాగో వస్తాడు కనక తనని ఆటలు పట్టిస్తుందేమోనని భయంతో ఆగిపోయింది. 'శ్రీరామ్ ఎదురు చూస్తుంటాడేమో? ఈ మొండిపిల్ల వచ్చేట్టు లేదు మరేదైనా ప్లాన్ వెయ్యాలి' అనుకుంటూ గబగబా వెళ్ళిపోయింది ఉమ. ఏమీ తోచక గరేజీలోంచి కారు తీసుకుని పబ్లిక్‌గార్డెన్స్‌కి బయల్దేరింది రాధిక. ఉమ, శ్రీరామ్‌లను థియేటర్‌దగ్గిర దింపి 'నేను తర్వాతవస్తాను. మీ ఇద్దరు వెళ్ళండి' అంటూ కారు వెనక్కి త్రిప్పాడు గోపాల్. అలా ఎందుకు చేశాడో గ్రహించిన ఇద్దరూ సిగ్గుపడ్డారు. అటు ఇటు తిరిగి చివరికి పబ్లిక్‌గార్డెన్స్‌కి దారితీసింది గోపాల్‌కారు.

'ఇదే మొదటిసారి! ఒంటరిగా రావటం' అనుకుంటూ అటు, ఇటూ చూస్తూ నడుస్తోంది రాధిక. ఆకాశం ఎర్రబడటంవలన ప్రకృతి వింతకాంతితో మెరుస్తోంది. ఆ వెలుగులో తెల్లని ఫుల్‌వాయిల్ చీర లైట్ రెడ్‌గా కనిపిస్తోంది. ఆమె జడలోని మల్లెలు సిగ్గుపడుతూ నవ్వుతున్నాయి. సూర్యుడు పూర్తిగా అస్తమించకముందే, తన స్నేహితురాళ్లను చిరునవ్వుతో పలకరిస్తున్నాడు పౌర్ణమి చంద్రుడు.

'హలో, గుడీవినింగ్! కోటివీణలు మ్రోగాయి ఆమె హృదయంలో. ఉలిక్కిపడి చుట్టూ చూసింది. చిరునవ్వుతో పలకరించాడు గోపాల్.' మీరొక్కరే వచ్చినట్లున్నారే! అన్నాడు పరిసరాల్లో చూస్తూ. అవునన్నట్లు తలవూపింది. ఏదోభయంతో గుండె వేగంగా కొట్టుకుంటోంది.

'రండి! అలా పోయి కూర్చుందాం? ముందుకు దారి తీశాడు.

నిశ్శబ్దంగా అనుసరించింది.

ఇద్దరూ నైట్‌క్వీన్ పొద ప్రక్కన కూర్చున్నారు.

'మీరు పిక్చర్‌కి పోలేదా?' అప్ర

# రాధికా పరిణయం

యత్నంగా అడిగి ఎందుకడిగానా, అనుకుంది.

'లేదండీ! మీరు రానన్నారట! ఇంక వాళ్ళిద్దరిమధ్య ఎందుకులే అని మానేశాను!'

భావయుక్తంగా నవ్వాడు.

రాధిక గుండె జల్లుమంది. తలవంచుకుని వేళ్లతో పచ్చికను తెంపుతూ కూర్చుంది.

'నేనంటే భయమా మీకు?'

లేదన్నట్లు తలవూపింది. ఇదివరకు తనే అందర్నీ ఈ ప్రశ్న వేసేది.

'మరి మాట్లాడరేం? పరీక్షలు బాగా వ్రాశారా?'

'ఊ...మరి మీరు?' ఏమీ అడగక పోతే బాగోదేమో, అన్నట్లు అడిగింది.

'క్లాస్‌రావాలని చదివాను మరి! వస్తే ఫారిన్ వెళ్లాలనుకుంటున్నాను!' ఆమె ముఖంలో మారుతున్న భావాలను గమనించి నవ్వుకున్నాడు. 'ఉమ చెప్పింది నిజమే' అనుకుని ధైర్యం తెచ్చుకున్నాడు,

'ఎం. కామ్. ఇక్కడే చదవచ్చుకదా? చదవాలనుకుంటే!' అంది జవాబు ఏదో ఇవ్వాలన్నట్లుగా!

'నేను వెళ్లటం మీకిష్టంలేనట్లుందే?' సూటిగా ప్రశ్నించాడు ఆమె ముఖంలోకి చూస్తూ. అనుకోని ప్రశ్నకు తడబడి 'ఉహూఁ. అదేం కాదు'...అంది బెదిరిపోయినట్లు.

'ఇటు చూడండి రాధికా!' మృదువుగా పిలిచాడు.

అతని గొంతులో నిండిన అనురాగానికి పులకించిందామె మనస్సు. బరువుగా కనులెత్తి చూసింది.

'మీరు పరిచయమైన మొదటి క్షణం లోనే మీ మనస్సు తెల్సుకున్నాను. కొద్ది రోజుల్లో కంట్రీ విడిచిపెట్టి వెళ్తున్నాను కనుక, వెళ్లేముందు నా మనసు కూడా మీకు తెలపాలని ఎదురు చూస్తున్నాను సమయంకోసం. ఇప్పటికి వచ్చింది ఫారిన్ వెళ్లేలోపల పెళ్ళిచేసుకుని వెళ్లమని మా అమ్మా, నాన్నా పట్టుబడుతున్నారు. 'నేను మిమ్మల్ని ప్రేమిస్తున్నాను. పెళ్లి చేసుకుంటాను' అంటే సినిమాలో డైలాగ్‌లా ఉంటుంది కాని, నిజం అదే! మీ ఉద్దేశ్యం తెలిపితే మీ వాళ్లతోకూడా నేనే చెప్పిస్తాను. కావాలంటే మీరూ అక్కడే చదువుకోవచ్చు. ఎవరి మనస్సుల్లోని వారి మనస్సుల్లో అలా ఉండగానే విడిపోతే తర్వాత ఇద్దరూ బాధపడాల్సి వస్తుంది!' నెమ్మదిగా చెప్పాడు గోపాల్.

ముంచుకువచ్చిన సిగ్గు ఆమెను పెదవి విప్పనీలేదు.

'మౌనం అంగీకారం అనుకోవచ్చా?' మధురంగా ధ్వనించిందతని కంఠం.

నవ్వుకుంటూ తల మరీ వంచేసుకుంది.

'చదువుకునే వారికి అందులో మీకు అంత సిగ్గెందుకు? పోనీ, ఎస్, ఆర్, నో అని చెప్పేయండి!' అన్నాడు ఆమెచేతిని తన చేతిలోకి తీసుకుంటూ.

అతని అరచేతిలో వ్రేలితో 'ఎస్' అని వ్రాసింది. ఆమెచేతిని అలాగే తీసి ముద్దు పెట్టుకున్నాడు తీయగా నవ్వింది రాధిక, చేతిని మృదువుగా వెనక్కి తీసుకుంటూ 'అంత కోపమయితే నేనెంత బాధపడ్డానో తెలుసా!'అని పాడుతోంది రేడియో. గతం గుర్తుకురాగా అతని కళ్లలోకి చూసి నవ్వింది.

'రాధికా!' ఆమె భుజంమీద చేతులు వేసి పిల్చాడు.

'క్రిష్ణా!' మత్తుగా పలికిందామె స్వరం.

నెలరాజు సిగ్గుతో మబ్బుల్లో దాక్కున్నాడు.

* * *

గేటు తీసుకు వస్తున్న గోపాల్ వాళ్లని చూసి లోపలికి పరుగెత్తింది రాధిక. ఎదురేగి వాళ్లను ఆహ్వానించారు రాధిక తల్లిదండ్రులు. గోపాల్, తల్లి, తండ్రి, ఉమ, తల్లి, తండ్రి, శ్రీరామ్ వరుసగా కుర్చీలలో కూర్చున్నారు. అందర్నీ పరిచయం చేశాడు శ్రీరామ్. ఒకరి కొకరు నమస్కరించుకున్నారు. ఉమ లేచి రాధిక గదిలోకి వెళ్లింది. రాధిక తల్లి లోపలికి వెళ్లి ఆమెను తీసుకు వచ్చింది. వెనకాలే ఉమ కూడా వచ్చింది. సిగ్గుతో నడకే మర్చిపోయినట్లుగా మెల్లగా వచ్చి తల్లి పక్క కుర్చీలో కూర్చుంది. ఆమె ప్రక్కన ఉమ కూర్చుంది.

''ఈ పెళ్లిచూపులు మనకోసం ఏర్పాటు చేసినవే కాని, నిజానికి యిదివరకే జరిగిపోయినయి' అన్నారు రాధిక తండ్రి కాబోయే వియ్యంకులతో. అందరూ నవ్వుకున్నారు.

సిగ్గుపడుతున్న ఉమను చూసి 'ఈ తీరున ఇద్దరికి జరుగుతున్నట్లున్నాయే పెళ్ళి చూపులు?' అన్నారు కళ్ళజోడు తీస్తూ. సిగ్గుతో తల వంచుకున్నారు ఉమ, శ్రీరామ్‌లు.

'మీ నలుగురు అలా తిరిగిరండమ్మా! మేము మాట్లాడుకుంటూ ఉంటాం!'

నలుగురూ లేచి తోటలోకి దారితీశారు.

'మా నాటకం సంతోషంగా పరిసమాప్తమయింది బాబూ!' పెద్దబరువు దిగిపోయినట్లు అంటూ శ్రీరామ్ ప్రక్కన కూర్చుంది.

'మా దానితోపాటూ మీదికూడా అయిందిగా?' అన్నాడు గోపాల్ ఆశ్చర్యపోయి చూస్తున్న రాధికను చూస్తూ శ్రీరామ్‌తో.

'నిజమే! ఇంట్లో ఎలా చెప్పటమా అని భయపడ్డాను' అంది ఉమ.

'నీకా? భయమూ?' వెక్కిరించాడు శ్రీరామ్.

'ఏయ్ మిష్టర్ ఏమన్నావ్?' కోపంగా చూసింది.

'ఆమెగారి కోపం నీకు వచ్చినట్లుందే?' రెట్టించాడు మళ్ళీ.

'అవును మరి—ఆరు నెల్ల సహవాసం చేస్తే వారు వీరూ—వీరు వారూ అవుతారట.' అన్నాడు గోపాల్. ఒకరి నొకరు చూసి నవ్వుకున్నారిద్దరమ్మాయిలూ.

'లోపలికి రమ్మంటున్నారు!' అన్నాడు నౌకరు వచ్చి.

లోపలికి వెళ్ళబోతున్న నలుగురూ హాల్లో నవ్వులు వినిపించి ఆగిపోయారు.

'మొత్తానికి మీ ఉమ ఘటికురాలే! ఒక్క దెబ్బకి రెండు పిట్టలు పడేట్టు చేసింది!' అంటున్నాడు గోపాల్ తండ్రి. మిగిలినవారు నవ్వారు. నలుగురూ కూడా నవ్వుతూ వచ్చి కూర్చున్నారు. అందర్కీ బిస్కెట్లు, డ్రింక్ ఇచ్చి వెళ్ళిపోయాడు నౌకరు.

'అన్నట్లు మరిచిపోయాను! రిజల్ట్సు రాగానే మా గోపాల్ అమెరికా వెళ్తాడు. అమ్మాయిని కూడా తీసికెళ్తే బావుంటుందనుకుంటున్నాం.'

'తీసికెళ్ళకపోతే మా రాధిక వరదల్లో కృష్ణా జిల్లా మునిగినట్లు విరహ సముద్రంలో మునిగిపోతుంది!' అంది ఉమ. గడుసుగా నవ్వింది రాధిక. అర్థంకాని మిగిలిన శ్రోతలుకూడా నవ్వకుండా ఉండలేక పోయారు. ●




ఆఫ్రికాలో ఒక ఘోరమైన రోగం ఉంది. దీనిని నిద్రారోగం అంటారు (హాస్యం కాదు!) కాంగో, రోడిషియా ప్రాంతాల్లో ఇది ఎక్కువగా వ్యాపించి ఉంది. ఈ రోగం ఫలితంగా మనుషులు నీరసించి, బద్ధకానికి గురి అయి మత్తునిద్రలో పడి శాశ్వత నిద్ర పొందుతారు. ఈ రోగానికి కారణం ఒక సూక్ష్మ జీవి. దీనిని ట్రిపనసోమా అంటారు. రక్తంలో స్వేచ్ఛగా తిరుగుతూ రక్తాన్ని పీల్చుకొని వృద్ధి పొందుతుంది. అంతేకాక క్రమంగా వెన్నుపాము మెదడు చేరి, నిద్రారోగం సంక్రమింప జేసి మరణాన్ని తెచ్చి పెడుతుంది. రోగగ్రస్తులవడం మూలంగా ఆ ప్రాంతాలు బీదరికానికి ఆలవాలమవుతూ వచ్చాయి. అదే విధంగా గుర్రాలకు పశువులకు కొన్నిటికి కూడా జబ్బులను తెచ్చిపెడతాయి. ఇదే క్రిమి, ఇతర జాతుల ట్రిపనసోములు ఎలకలు మొదలైన ఇతర జంతువుల శరీరంలో ఉన్న వాటికి ఏ విధమైన హాని కలగడంలేదు.

ఒక మానవ శరీరం నుండి మరొక మానవుని శరీరంలోకి ఈ క్రిమిని చేరవేయడానికి వీలు కల్పించే జీవి గ్లోస్సైనా అనే (మన ఈగను పోలిన) కీటకము. అది రక్తం పీల్చినప్పుడు రోగి నుండి తన శరీరంలోకి క్రిములు కూడా ప్రవేశిస్తాయి. అవి కొంతకాలం దాని శరీరంలో వృద్ధి పొంది మార్పులు చెంది తిరిగి దాని కాటు ద్వారా ఇతరుల శరీరంలోకి ప్రవేశిస్తుంది. ఈ పనిని ఉభయ లింగాల కీటకాలు చేస్తాయి. 'గ్లోస్సైనా'నే ట్సెట్సె (Tse Tse) ఈగ అనీ అంటారు. ఇది మన ఈగ కన్నా కొంచెం పెద్దది. అంతేకాక మన ఈగ లాగా కాక దోమల లాగా రక్తాన్ని పీల్చుకొని జీవిస్తుంది. అయితే దీని జీవిత చరిత్ర చిత్రంగా ఉంటుంది. గ్రుడ్లు పెట్టదు (ఈగలు గ్రుడ్లు పెడతాయి). ప్రతి పదిరోజులకి ఒకేలార్వా! పూర్తిగా ఎదిగి జన్మిస్తుంది. పుట్టగానే ఆహార తాపత్రయం పడక వెంటనే నేలలో దూరి 'ప్యూపా'గా మారుతుంది. తరవాత కొన్నివారాల తరవాత రూప విక్రియ జరిగి ఈగ రూపంలో బయటకు వస్తుంది.

క్రిమిని, ఒక మానవుడి నుంచి మరొక మానవుడికి గ్లోస్సైనా అందించినా, మరొక సదుపాయం కూడా క్రిమి ఏర్పరచుకొంది. అడవిమృగాలు (ఏంటిలోపు మొదలైనవి) శరీరంలో ఇవి నిలవ ఉంటాయి. కాని చిత్రం వాటి కిఏవిధంగాను హాని చెయ్యవు. కాని ఈగ వాటిని కాటు వేసి క్రిములను సేకరించి, మన శరీరంలో ప్రవేశపెట్టినపుడు మాత్రం మనకు రోగం వస్తుంది. ఎంత ఘోరం!

ఇప్పటికే మానవుడు ఈ రోగాన్ని పూర్తిగా జయించలేకపోయాడు. ముఖ్యంగా రోగం ముదిరితే, నయం కావడం కష్టం. మొదటి దశల్లో ఆర్సెనిక్ మొదలైన వాటివల్ల కొంత గుణం కనబడుతుంది. ట్సెట్సె ఈగను, నాశనం చెయ్యడం మొదలైన క్రియల వల్ల రోగ నివారణకు కొంత సదుపాయం కల్గింది.

'జీవితం ఎంత అందంగా వుంది!' నిద్రపోతున్న సుధాకర్ ముఖంలోకి తృప్తిగా చూస్తూ అనుకుంది లలిత.

స్త్రీకి అయినా పురుషుడికయినా వివాహంతోనే పరిపూర్ణత కలుగుతుంది. బ్రతుకులో కొత్త అందాలని, అపురూపమైన అనుభూతులని అంతులేని ఆనందాన్ని ప్రసాదిస్తుంది సంసార జీవితం.

మమతలని పెంచుకుంటూ, జీవితంలో ఆనందపు లోతులని అనుభవిస్తూ భవిష్యత్తు గురించి బంగారు కలలు కంటూ కష్టాన్ని సుఖాన్ని సమానంగా పంచుకోవటానికి జీవితాంతం వరకూ తనకో తోడు వుందన్న ధైర్యంతో రాబోయే జీవితం కోసం ఎదురుచూస్తూ వుండటం ఎంత చిత్రమైన అనుభూతి!




వివాహానికి పూర్వం తన మనసులో చెలరేగిన సంఘర్షణ, సమాధానాలు దొరకని సందేహాలు, భయాలు అసంతృప్తి గుర్తుకి వచ్చాయి లలితకి. హాయిగా నవ్వుకుంది.

రెండవపెళ్లి. యిద్దరు పిల్లల తండ్రి— అని ఎంతగా భయపడిపోయింది తను?

చాలీచాలని జీతం, మధ్యతరగతి కుటుంబం, సవతి పిల్లలు—భవిష్యత్తు గురించి ఎంత అసంతృప్తితో భయంకరంగా ఊహించుకుంది?

ధగధగా మెరిసిపోయే నగలూ, పట్టు చీరలు, కారూ అంతస్థూ కావాలని తాహతుకిమించిన కోరికలు తనకి ఎప్పుడూ లేవు ఆర్థిక యిబ్బందులు లేకుండా ఎటువంటి బాధ్యతలూ బరువులూ లేని జీవితం కావాలనుకునేది. జీవితం చరమదశలో సైతం గుర్తుతెచ్చుకుని తృప్తిగా నవ్వుకునేలా అందమైన అనుభూతులతో

# కొత్త సీరియల్ ప్రారంభం!




వివాహం తరవాత రెండు సంవత్సరాల వరకూ ఆనందంగా గడిపివేయాలని, అప్పటివరకూ పిల్లలు పుట్టకుండా జాగ్రత్తపడి తరువాత యిద్దరు పిల్లలు కంటె ఎక్కువమంది పుట్టకుండా ముందు జాగ్రత్తలు తీసుకోవాలని ఎన్నెన్నో ఊహించుకున్న తనకి సుధాకర్ భర్త కాబోవటం ఏమాత్రం సంతోషాన్ని కలుగ చేయలేదు. కేవలం కన్నవాళ్ల బరువు బాధ్యతలని తగ్గించటంకోసమే వివాహానికి సమ్మతించింది. కట్నాలు కానుకలు యిచ్చుకుని వరుడిని కొనగల తాహతు లేని మధ్య తరగతి **కుటుంబంలో** పుట్టిన తన దుర దృష్టాన్ని నిందించుకుంటూ, వచ్చిన సంబంధాలన్నీ ఏదో వంకన తిరిగి పోతుంటే విసిగి వేసారిపోయి ఎవరో ఒకరు భర్త అనే వాడు దొరికితేచాలు తనకీ ఒక యిల్లంటూ వుండాలి అని చేసుకుంది.

కానీ తనెంత అదృష్టవంతురాలు! సుధాకర్ కోటికోరికలని, అంతులేని అనురాగాన్ని దాచుకుని తనని నిండు మనసుతో స్వీకరించాడు. చిలిపిచేష్టలతో అల్లరి **మాటలతో** ఆప్యాయత కురిపించే చూపులతో చురుకుగా **ఉత్సాహంగా** వుండే సుధాకర్‌కి యిద్దరు పిల్లలు, యిదివరకు ఒక స్త్రీతో జీవితాన్ని పంచుకున్నాడని తలుచుకుంటే ఎంత వింతగా వుంటుంది తనకి!

తన కొంగు విడవకుండా వెంటతిరిగే అతను, యవ్వనంలో అప్పుడే అడుగు పెట్టిన నవ యువకుడిలా వుంటాడేకాని రెండవ పెళ్లిచేసుకున్న వాడిలా వుండడు. ఎన్నెన్నో ఖబుర్లు చెబుతూ నవ్వుతూ నవ్విస్తూ గంటలని క్షణాలలో దొర్లించేయటం అతనిలోని ప్రత్యేకత. సుధాకర్ ఆఫీసుకి వెళ్లటంతో పగలంతా ఒంటరిగా ఏలాగో వుంటుంది తనకి. మూడు నిద్రలు





చేయటానికి అత్తగారింటికి వెళ్ళినప్పుడు పిల్లలిద్దరినీ చూసింది కానీ వాళ్ళు తన దగ్గరికి రాలేదు. చనువుగా పిలిచి దగ్గరికి తీసుకోవాలనిపించినా అందరూ ఏమనుకుంటారో, చాటుగా నవ్వుకుని కొత్త మురిపెం అని విమర్శిస్తారేమోనని భయపడింది. చిన్న పిల్లలంటే తనకి అపేక్ష వుంది కానీ వాళ్ళని లాలించటం, పెంచటం బొత్తిగా చేతకాదు.

పిల్లల్ని తీసుకుని వస్తున్నామని వారంరోజుల క్రితం చిన్న ఆడపడుచు ఉత్తరం వ్రాసింది. అది చూపిస్తూ ముఖం చిట్లించుకున్నాడు సుధాకర్. 'యింకో రెండు నెలలవరకూ అరుణ చూసుకోగూడదూ? పిల్లల్ని? అంత తొందరేం వచ్చిపడిందని అప్పుడే ప్రయాణం' పెట్టుకోవాలి'. అన్నాడు అయిష్టంగా.

తన భర్తకి పిల్లలమీద అంత ప్రేమ లేదేమో అనిపించి తల్లిలేని ఆ పసివాళ్ళమీద జాలిపడింది. కన్న తల్లిలా వాళ్ళని చూసుకోవాలని సవతి తల్లి అనే ఆలోచనే ఆ పిల్లల మనసులో మెదలకూడదని నిర్ణయించుకుంది.

బహుశా తను విసుక్కుంటుందేమోనని సుధాకర్ అలా అన్నాడేమో అనుకుని లోలోపల నవ్వుకుంది.

'అన్నివిధాల మనకంటే యింగ్లీష్ వాళ్ళు తెలివిగలవాళ్ళు లలితా. పెళ్ళి చేసుకోగానే హాయిగా హనీమూన్‌కి వెళతారు. తర్వాత ఎటూ సంసారం బాదరబందీ తప్పవు. క్రొత్తలో అయినా అచ్చట ముచ్చట తీర్చుకోవద్దూ? కాస్త నాలుగు నెలల వరకయినా ప్రశాంతంగా మనల్ని ఉండనీయక కొంపలు అంటుకుపోతున్నట్టు అంత తొందర ఏమిటి మా నాన్నకి? చెల్లాయికి పెళ్ళి కుదిరితే అప్పుడెటూ పిల్లల్ని తీసుకుని రాక తప్పదు. నీకు ఆరోగ్యం బావుండలేదని ఉత్తరం రాసి పడేస్తాను. తర్వాత ఎప్పుడో వస్తారులే' అంతవరకూ చిరాకుగావున్న సుధాకర్ తను కాదన్నదన్న నమ్మకంతో ఉత్సాహంగా అడిగాడు.

'అలా రాస్తే బావుండదు. నాకు పిల్లలు రావటం యిష్టంలేక నేనే అలా వ్రాయించానని అనుకుంటారేమో. పగలంతా ఒంటరిగా వుండాలి. బొత్తిగా తోచటంలేదు నాకు. పిల్లలువస్తే సందడిగా వుంటుంది. అయినా ఎలాగూ ప్రయాణం అయ్యారుగా వాళ్ళని ఆపటం దేనికి?' తన అయిష్టాన్ని దించుకోలేదు.

సుధాకర్ కొద్దిగా ఆశ్చర్యంగా చూశాడు. 'సవతిపిల్లలకోసం అంత కలవరిస్తూ ఎదురు చూస్తున్నావా?' అన్న వ్యంగ్యం తొంగి చూసింది ఆ కళ్ళల్లో. మనస్సు చివుక్కుమంది. అది తన భ్రాంతి. సుధాకర్‌లో అలాటి ఉద్దేశం వుండి వుండదని తనని తాను మందలించుకుంది.

అయినా మనసులో ఏమూలో బెంగ. ఈ నెల రోజులు గడిచిపోయినంత సరదాగా సంతోషంగా యింక ముందు జరగదేమో అన్న భయం. సవతి తల్లుల గురించి ఎన్నో కథలు చదివింది. విన్నది. తనెంత బాగా చూసుకున్నా లోకం దృష్టిలో తను సవతి తల్లే! సుధాకర్ ప్రవర్తన ఎలా మారుతుందో! పిల్లల రాక తమ సంసారంలో ఎటువంటి మార్పులని తీసుకుని వస్తుందో!

చల్లని పిల్లగాలులు చిలిపిగా తాకి గిలిగింతలు పెట్టాయి. పలుచని వెన్నెల రేఖలు కిటికీలోనుండి తొంగిచూస్తున్నాయి. ప్రశాంతంగా నిద్రపోతుంది ప్రకృతి.

లలిత నవ్వుకుంది.

వివాహం ఎంత చిత్రమైన మలుపు!

ఎక్కడో పుట్టి పెరిగి విభిన్న మనస్తత్వాలతో అభిరుచులతో పెరిగిన యిద్దరి జీవితాలని వివాహ వేదికమీద ఆత్మీయుల సమక్షంలో మంగళ వాయిద్యాలతో అగ్నిసాక్షిగా ఒకటిగా ముడివేసి జీవితాంతం కష్టసుఖాలని సమానంగా పంచుకోమని శాసిస్తుంది.

రెండు జీవితాలని అందంగా విడదీయలేనంత బలంగా ముడివేసి శారీరకంగా మానసికంగా అతి సన్నిహితంగా తీసుకుని వచ్చే వివాహ వ్యవస్థమీదకూడా ఆర్థిక ప్రభావం!

జీవిత భాగస్వామిని ఎన్నుకోవటంలో తమ కోరికలకి అభిరుచులకి ఆశయాలకి అన్నివిధాల అనుగుణంగావున్న వధువుని ఎన్నుకోవటంకాక తాముకోరిన కట్నం తేగలతాహతువున్న పిల్లని మనసారా అంగీకరించినా లేకపోయినా పెద్దల అభీష్టాన్ని కాదనలేక కట్నంమీద ప్రలోభంతో అంగీకరించటం యువకుల బలహీనత, దురదృష్టం.

మంచి పొడుగూ పొడుగుకి తగిన లావుతో అందంగా హుందాగా వుండే భర్తకి సన్నగా పొట్టిగా వుండే అనాకారి భార్య. పసిమి ఛాయలో బంగారుతీగెలా మెరిసిపోయే పిల్లకి కారు నలుపుతో మోటుగావుండే భర్త. విశాల హృదయంతో ఆలోచించే సంస్కారికి సంకుచిత భావాలుగల గృహిణి, ఆధునిక భావాలుకల యిల్లాలికి పురాణాలమీద పాతివ్రత్యం మీద మోజు వదలని పతిదేవుడు శాంతస్వభావంగల భర్తకి గయ్యాళి అయిన



అర్ధాంగి — బాహ్య సౌందర్యంలోనేకాక మనసులు కలవని మనువులు కావటానికి చాలావరకూ కట్నాలే కారణం అవుతున్నాయి.

భావి జీవితాన్ని పంచుకునేది భార్యతో, ఆమె తెచ్చేకట్నం డబ్బులతో కాదన్న నిజాన్ని ఎందుకు నిర్లక్ష్యం చేస్తున్నారు ఈ నాటి యువతరం? సుఖంగా బ్రతకటానికి ధనం అవసరమేకానీ ధనవంతుడయిన ప్రతివాడూ సుఖపడటం లేదు. మానవుడు సృష్టించిన ధనమే అతని జీవితాన్ని పాలిస్తోంది — ఎంత విచిత్రం? మనిషి పుట్టింది డబ్బుకోసం కాదని ఎందుకు ఆలోచించదీ యువతరం?

సాటి స్త్రీ కష్టసుఖాలని సానుభూతితో అర్ధం చేసుకోలేదు స్త్రీ. కుమార్తె, సోదరి, అర్ధాంగి, మాతృమూర్తిగా పురుషుడి జీవితంలో ప్రముఖ స్థానాన్ని కలిగిన మహిళాలోకం గట్టిగా తెలుసుకుని ఆచరణలో పూనుకుంటే ఈ కట్నాల సమస్య పరిష్కారం కాదా?

కట్నం చాలకపోతే పిల్ల నచ్చలేదని ఎంతో తేలిగ్గా అనేసి తప్పించుకుంటారు. అందుకు ఆ పిల్లమనసు ఎంతగా గాయపడుతుందో ఒక్కరూ ఆలోచించరు. కూర గాయల బేరంలా సాగిపోయే కట్నాలరేటు కుదిరే వరకూ ఎందరెందరో వచ్చి చూసి పోతూ వుంటే కన్నెమనసు ఎలా కుమిలి పోతుందో ఎవ్వరికీ పట్టదు డబ్బుకున్న విలువ మనసుకి మనిషికి లేదు. అందుకే మనసులలో దాగని అసంతృప్తి, నిరాశ నిస్పృహలు.

కలిగిన దానితో గారాబంగా పెంచుకున్న ఆడపిల్ల పెళ్ళికి ఎదగగానే గుండెలమీద కుంపటిలా వుంటుంది కన్నవారికి. చదువూ సంస్కారం వున్న యువతికి అంతకంటె అవమానం మరొకటి వుండదు. అభిమానంతో ఉడికిపోతూ, తన అభిరుచులని కోరికలనీ కలలనీ బలవంతంగా మరచిపోవాలని ప్రయత్నిస్తూ చివరికి ఎవరో ఒకర్ని కట్టుకుని కన్నవారిబరువు తప్పించాలని అనుకుంటుంది.

అతి పవిత్రంగా ఎంచుకునే వివాహ వ్యవస్థ యింతగా పతనమైపోతుంది.

ప్రభుత్వం శాసనాలు చేయగలదేకానీ మనసులని మార్చలేదు. మనసుని కదిలించేలా రచనలు చేసే రచయితల శ్రమకూడా ఫలించటంలేదు. అందరికీ తెలుసు కట్నాలు యివ్వకూడదని — పుచ్చుకోకూడదని. కానీ ఆచరించే దెవరు?

రోజురోజుకీ కట్నాలరేట్లు పెరిగిపోతూంటే వాటిని అందుకోలేని మధ్య తరగతి కుటుంబీకులు ఎంతగా నలిగిపోతున్నారో ఎవరికి కావాలి?

ఎన్ని కన్నెమనసులు కుమిలిపోతున్నాయో, బంగారు కలలు పండించుకోవలసిన బ్రతుకులు ఎలా బద్దలవుతున్నాయో ఎవరికి కావాలి?

బరువుగా నిట్టూర్చింది లలిత.

ఆ బాధ తనకి తెలుసు. యిద్దరు పిల్లల తండ్రి, గుమస్తా అయిన సుధాకర్ కట్నం వద్దనేసరికి అమ్మా నాన్నా ఎంతగా సంతోషించారో తను ఎప్పటికీ మరచిపోలేదు. తన అభిప్రాయం అడిగే ధైర్యంలేక అడగకుండా వుండనూలేక, తను కాదంటుందేమోనన్న భయంతో వాళ్ళెంతగా సతమతమయిపోయారో తలుచుకుంటే జాలి వేస్తుంది.

చదువులో అందంలో ఉద్యోగంలో ఎందులోనూ తనకంటె అధిక్యత లేని వ్యక్తి తనని వివాహం చేసుకోవటానికి అంగీకరించటంలో చూపించిన ఉదారత ఏమిటి?

మగవాడై పుట్టినందుకా అంత గిరాకీ?

ఆడదై పుట్టటమే దురదృష్టమా?

లలిత ఆలోచనలు చెదిరిపోయాయి. సుధాకర్ నిద్రలో కదిలి దగ్గరికి లాక్కున్నాడు. ఆలోచనలతో అలసిపోయిన లలిత అతని కౌగిలిలో కరిగిపోతూ కళ్ళు మూసుకుంది.

* * *

'కొత్త సామానేమీ కనపడటం లేదే?' పెదవి విరుస్తూ యిల్లంతా కలియజూసింది అరుణ.

లలిత మౌనంగా భర్త ముఖంలోకి చూసింది.

అదేమీ విన్పించుకోనట్టు బాబ్జీని ఎత్తుకుని మున్నిని దగ్గరికి తీసుకొని కబుర్లు చెప్పించుకుంటున్నాడు సుధాకర్.

ఖాళీ అయిన కాఫీగ్లాసులని తీసుకుని వెళుతున్న లలితకి 'మీ అత్తగారు సామానేమీ యివ్వలేదా అన్నయ్యా?' అని అరుణ అడగటం వినిపించింది.

కింద పెదవి కొరుక్కుంటూ సుధాకర్ ఏమంటాడో అని శ్రద్ధగా ఆలకించింది.

'కట్నం కానీ అడగలేదుకదా మనం? కాపురానికి పంపేటప్పుడు కూతురికి సామాను యిచ్చుకోక పోతారా అని అడగకుండా ఊరుకుంటే యిదేమిటా? నువ్వైనా గట్టిగా అడగవద్దా?' మామగారి గొంతు విని నీరస పడిపోయింది.

'యిదివరకటి సామాన్లు వున్నాయి మీ వాళ్ళని యిబ్బంది పెట్టి ఖర్చు చేయిం



చటం నా కిష్టంలేదు లలితా. నువ్వేమీ తీసుకుని రావద్దు. అంతగా కావాలంటే అక్కడ మనమే కొనుక్కుందాం. యిద్దరి సంపాదనతో ఆ మాత్రం కొనుక్కోలేక పోతామా?' అని వారించిన సుధాకర్ మాటలకి ఆనాడు తనెంత గర్వపడింది?

సంసారానికి అత్యవసరమైన చిన్నచిన్న సామానే తెచ్చుకుంది. సోఫాసెట్లూ, పందిరి మంచాలూ యివ్వలేని తాహతు లేదు తన వాళ్ళకని ఆడపడుచుకి తెలియదా, మామగారికి తెలియదా?

అయినా పెళ్ళికాని చిన్నపిల్ల ఆరిందలా రాగానే ఆరాలు తీయటం మొదలు పెట్టిందేమిటి? ఎవరో పరాయివాళ్ళలా అంటీ అంటనట్టుగా గదిలో కూర్చుని పలకరిస్తే ముభావంగా సమాధానాలిస్తున్న అరుణ గురించి ఆలోచిస్తూ వంటపనిలో మునిగిపోయింది లలిత.

పనంతా అయ్యాక క్షణంసేపు విశ్రాంతి తీసుకుంటూ కుర్చీలో కూర్చుని తనని చాటుగా చూస్తూ మేనత్త వెనుక దాక్కున్న బాబ్జీని, అరుణ చీర కుచ్చెళ్ళు పట్టుకుని నిలబడిన మున్నిని ఆదరంగా పిలిచి దగ్గరికి తీసుకోబోయింది.

'అసలే అల్లరిపిల్లలు. రేపటినుండీ ఎటూ నీకు తప్పదుగా. ముందు అన్నాలు పెట్టించు నాన్నకి. పెద్దతనం కదూ ఆగలేరు' ముక్తసరిగా అంది అరుణ.

వస్తున్న నిట్టూర్పుని అణచుకుని మౌనంగా లేచి వంటగదిలోకి వెళ్ళింది లలిత.

సాయంకాలం టిఫిన్ కాఫీకాగానే స్టౌ మీద యసరు పెట్టి, జుట్టు విరబోసుకుని తిరుగుతున్న మున్నీని దగ్గరికి పిలిచింది. బెరుకుగా చూస్తూ నిలబడిందే కానీ కదల లేదు. పిల్లలు వస్తారని అంతకు ముందు రోజే తెప్పించిన చాక్లెట్లు కొన్ని లంచం చూపించి లాలిస్తూ దగ్గరికి తీసుకుంది జడలు వేయాలని.

అంతవరకూ పత్రిక ఏదో తిరగవేస్తూ పడుకున్న అరుణ గభాల్న లేచి వచ్చింది—'నీచేత వేయించుకోదు వదినా నేవేస్తానులే' అంటూ.

లలిత తెల్లబోయి చూసింది. అదేమీ పట్టించుకోకుండా లలిత చేతుల్లోనుండి దువ్వెన తీసుకుని మున్నిని పిలిచింది.

నిద్ర లేచాక బాబ్జీకి స్నానం చేయించ

# డా. జె. బి. చటర్జీ



స్కూల్ ఆఫ్ ట్రాపికల్ మెడిసిన్ [కలకత్తా] డైరెక్టర్ డా. జె. బి. చటర్జీ, ప్రపంచంలో గొప్ప వైద్యశాస్త్రజ్ఞులలో ఒకరు. వీరు ప్రత్యేకంగా రక్తశాస్త్రం [హిమటాలజీ]లో గత 25 సంవత్సరాల నుంచి అపారమైన కృషిచేసి, అనేక కొత్త సంగతులు కనిపెట్టారు. మన దేశంలో రక్తసంబంధమైన జబ్బులకి ఆహారంలో లోటుపాట్లే ముఖ్యకారణం అని వీరు నిరూపించారు. అందువల్ల శాకాహారులంతా పాలు తప్పనిసరిగా వాడాలని డా. చటర్జీ అంటారు.

డా. చటర్జీ కలకత్తాలో 1919లో పుట్టారు. 1942లో కలకత్తా యూనివర్సిటీలో యం. బి. బి. యస్. డిగ్రీ తీసుకున్నారు. ఆ సందర్భంలో వీరికి కాల్వర్ట్ పతకం లభించింది. 1949లో యం. డి. డిగ్రీ తీసుకుని, అమెరికాలో న్యూ ఇంగ్లండ్ వైద్య కేంద్రం [బోస్టన్]లో రాక్‌ఫెల్లర్ ఫౌండేషన్ ఫెలోగా 1950—52లో రక్తశాస్త్రంలో అతి ముఖ్యమైన పరిశోధనలు జరిపారు.

డా. చటర్జీ అనేక అంతర్జాతీయ సమావేశాలకి హాజరయ్యారు. టోకియో [1960], స్టాక్‌హోం [1964], సిడ్నీ [1966], న్యూయార్క్ [1968]లో జరిగిన అంతర్జాతీయ రక్తశాస్త్ర సంఘసమావేశాల్లో ఒక విభాగానికి అధ్యక్షత వహించారు. వీరు ప్రచురించిన వ్యాసాలు 500పైనే ఉంటాయి. వీరి పరిశోధనా ఫలితాలు ప్రామాణిక గ్రంథాల్లోకి ఎక్కిపోయాయి.

డా. చటర్జీకి అనేక బహుమానాలు, సన్మానాలు లభించాయి. [1] కలకత్తా యూనివర్సిటీ కోట్స్ పతకం [1958], [2] ఏషియాటిక్ సొసైటీ బార్క్లే పతకం [1963], [3] భారతీయ వైద్యపరిశోధనా సమితివారి బసంతీదేవి అమీర్‌చంద్ బహుమానం [1964] [4] మింటో స్వర్ణ పతకం [1965].

డా. చటర్జీ భారత రక్తశాస్త్ర సంఘానికి [1963—64], భారత యాంత్రోపాలాజికల్ సంఘానికి [1968—69], భారత సైన్స్ కాంగ్రెస్, వైద్యశాస్త్ర విభాగానికి [1964], భారత పేథాలజీ సంఘానికి [1968] అధ్యక్షులుగా పని చేశారు. అనేక విదేశ రక్తశాస్త్ర సంఘాల్లో సభ్యులు. అమెరికన్ కాలేజ్ ఆఫ్ ఫిజీషియన్స్‌లో కరెస్పాండింగ్ ఫెలోగా ఎన్నికైన [1965] మొదటి భారతీయుడు వీరే.

పరిశోధకులుగాను, అధ్యాపకులుగానే కాకుండానే వీరు దేశానికీ, సమాజానికీ, ఇతర రంగాల్లో కూడా సేవచేస్తున్నారు. రామ్మోహన్ లైబ్రరీ, క్షయనివారణ, కుష్ఠు నివారణ సంఘాల్లో సభ్యులు. సారస్వతంలోనూ, తోటపనిలోనూ వీరికి మంచి అభిరుచి ఉంది.

—డా॥ ఆర్. ఎల్. ఎన్. శాస్త్రి.

టానికి సందేహిస్తూ బాత్‌రూమ్‌లో నీళ్ళు పెట్టి సబ్బూ టవలూ అన్నీ రెడీగా వుంచింది. దాదాపు వేడినీళ్ళు చల్లారి పోయాక హడావుడిగా రెండు చెంబులు గుమ్మరించి స్నానం అయిపోయిందనిపించిన అరుణని చూస్తూ మౌనంగా వుండిపోయింది.

చీకటిపడినా ఆటలలో మునిగిపోయి లలిత భోజనానికి పిలిచినా రాలేదు మున్నీ. బాబీకి ఆకలి వేసిందేమో అత్త కొంగు పట్టుకుని లాగుతూ సన్నగా రాగాలు తీస్తున్నాడు. గిన్నెలో అన్నం కలుపుకుని వచ్చి బాబీని మరిపించి ఎత్తుకోబోయింది. 'నీపని చూసుకో వదినా. నేను వెళ్ళాక నీకెటూ తప్పదుగా' అంటూ చేతిలో గిన్నె తీసుకుని బాబీని ఎత్తుకుని బయటికి వెళ్ళిపోయింది అరుణ.

ఆడపడుచు ప్రవర్తన అర్థంకా లేదు లలితకి. పిల్లలిద్దరికీ కొత్త పోగొట్టి అలవాటుచేసుకోవాలని తను ప్రయత్నిస్తూంటే పిల్లలని తన దగ్గరకే రానీయటంలేదు అరుణ. ఆ అమ్మాయి ఉద్దేశం ఏమిటి? తను పిల్లలని బాగా చూడదనా? లేకపోతే తనకి శ్రమ ఎందుకని ఆమె ఉన్నన్ని రోజులు పిల్లల పనులు చూసుకుని తనకి అలసట తగ్గిద్దామనా?—ఎటూ తెగని ఆలోచనలతో మథనపడింది.

# లలిత

మరునాటిరోజు ఉదయం స్నానం చేసిన అరగంటకే నెత్తినిండా మట్టిపోసుకుని వచ్చింది మున్నీ.

'ఛా. ఏమిటమ్మా యిది? మట్టి తల మీద పోసుకుంటారా? తప్పుకాదూ' లలిత మందలిస్తూ మట్టి దులపబోయింది. లలితంటే బెరుకూ భయమూ తగ్గని మున్నీ ఆమె కొడుతుందేమో అన్న భయంతో పరిగెత్తబోయి బోర్లపడి గట్టిగా ఏడవటం మొదలుపెట్టింది.

'అరుణా. పిల్ల ఏడుస్తోంది ఎందుకో చూడమ్మా' ముందు గదిలోవున్న ముసలాయన కూతుర్ని కేకవేసాడు.

'ముందు ముందు వాళ్ళకి ఎటూ పోట్లు తప్పవు. ఈ నాలుగురోజులన్నా కాస్త కనిపెట్టుకుని వుండమ్మా' స్వరం తగ్గించి చెప్పినా స్పష్టంగానే వినపడింది లలితకి. ర్మాన్పడిపోయి నిలబడిపోయింది.

'ఎందుకే ఏడుస్తున్నావు? అక్కడే నిలబడివున్న లలితవైపు చూడకుండానే మున్నీని ఎత్తుకుని గబగబా ముందు గదిలోకి వెళ్ళిపోయింది. 'పిన్ని దగ్గరికి ఎందుకు వెళ్ళావు మరి? నేనిక్కడేవున్నాను కదా. నాదగ్గరికి రాకపోయావా? ఏదీ ఎక్కడ కొట్టింది? బాగా నొప్పిపెడుతోందా?' గొంతు తగ్గించి అడిగింది అరుణ.

అక్కడ నిలబడలేకపోయింది లలిత. వంటగదిలో స్టౌముందుకూర్చుని మోకాళ్ళ మీద గడ్డం ఆన్చి నీలిరంగులో మండుతున్న మంటని చూస్తూ కూర్చుంది.

ఎంతగా సరిపెట్టుకుందామన్నా ఆడపడుచు ప్రవర్తన మాటలు తలుచుకుంటే అసహ్యంవేస్తోంది లలితకి. మావగారు కొంచెం తక్కువగా మాట్లాడితే మందలించవలసిందపోయి తనేదో ఆర్చిళ్ళుపెట్టి పిల్లలని రాచి రంపాన పెడుతున్నట్టు ఏమిటా మాటలు? అందరిలోకి చిన్నపిల్ల అమాయకురాలు అని సుధాకర్ చెబుతోంటే అరుణగురించి తనెంత తెలివితక్కువగా అంచనా వేసుకుంది. తనచెల్లెళ్ళలా తనతో కలిసిపోయి సరదాగా వుంటుందని అనుకుంది. అంటీ అంటనట్టు మసులుతూ పిల్లలని తన దరిదాపులలోకి రానీయకుండా పుల్లవిరుపుగా మాట్లాడుతూంటే తనెంతవరకూ సహించగలదు?

చెల్లెలు వచ్చిన రెండవరోజునుండీ వాడీలు మొదలుపెట్టిందని అనుకుంటాడేమో అని భర్తకేమీ చెప్పలేదు. అయినా లలిత ముభావంగావుండటం చూసి ఏదో జరిగి వుంటుందని పసిగట్టి సుధాకర్ బలవంతం చేసాడు చెప్పమని. సందేహిస్తూనే జరిగింది వివరంగా చెప్పింది లలిత.

అంతావిని 'ముందే నేను చెప్పలేదూ? ఇంకా కొద్దికాలం హాయిగా వుందామంటే పిల్లలని తీసుకుని రమ్మని గోల చేసావు' న్నాడు అందులో తన తప్పేమీలేదన్నట్టు.

పుండుకి కారం రాచినట్టయ్యింది లలిత కోపంగా ఏదో అనబోతూంటే అందుకు అవకాశం యివ్వకుండా బాగా దగ్గరికి తీసుకుని 'పోనిద్దూ. వెడవగొడవ. పగలంతా అలిసిపోయినట్టున్నావు. విశ్రాంతి తీసుకో' అన్నాడు కదలబోతున్న పెదవులని మృదువుగా స్పృశిస్తూ.

(ఇంకా ఉంది)



ముగ్గురు మూర్ఖులు)

# ఖాండవ వనదహనం



'మహేష్'

చంచల్రావు, చూడామణి ముందుగా వచ్చారు. చిదంబరం రావడం ఆలస్య మయింది.

'రావడం యెందుకు ఆలస్యం అయింది?' అని చిదంబరం రాగానే అతన్ని ప్రశ్నించాడు చూడామణి

'నేను వస్తున్న దారిలో ఒక లారీ యెడ్లబండికి గుద్దుకొంది. అక్కడే కొంచెంసేపు ఉన్నాను'.

'లారీ ప్రమాదాలు, బస్సు ప్రమాదాలు చాలా యెక్కువై పోతున్నాయి. వీటి వలన బళ్లమీద వెళ్లే వారికీ, పాదచారులకు భద్రత లేకుండా పోయింది' అన్నాడు చూడామణి.

'ఈ కార్లు, బస్సులు, లారీలు వీటిని శాస్త్రజ్ఞులు కనిపెట్టకుండా ఉంటేనే బాగా ఉండేది' అని ఒక్కోసారి అనిపిస్తుంది. వీటి వలన ప్రజల ప్రాణాలకు రక్షణ అనేది లేకుండా పోతున్నది' అన్నాడు చంచల్రావు.

'ఈ విషయంలో శాస్త్రజ్ఞులను నిందించవలసిన అవసరం యేమీలేదు. ఉదాహరణకు నూరు ప్రమాదాలు జరిగాయి అనుకో, వాటిలో కేవలం యంత్రం యొక్క లోపంవలన జరిగే ప్రమాదాలు రెండు గాని మూడుగాని ఉంటాయి. మిగిలినవి అన్నీ డ్రైవరు యొక్క నిర్లక్ష్య వలన గాని, పాదచారుల యొక్క అజాగ్రత్త వలన గాని జరుగుతుంటాయి. అందుచేత కార్లు మొదలైన వాటిని నిర్మించే విధానాన్ని కనుగొన్న శాస్త్రజ్ఞులకు యీ ప్రమాదాల బాధ్యత యేమీ లేదు' అన్నాడు.

'నువ్వు చెప్పింది నిజమే. కాని వేగంగా ప్రయాణం చెయ్యడానికి అవకాశం ఉన్నప్పుడు, దానిని పూర్తిగా వినియోగించుకోవడానికి ప్రయత్నించడం మానవ స్వభావం. రాను రాను మానవుని ఆలోచనలో కూడా యిందుకు తగిన మార్పువస్తున్నది. ప్రజలు ఇదివరకు కొంచెం ఆలస్యమైనా, జాగ్రత్తగా వెళ్ళాలని కోరుకొనేవారు. ఇప్పుడు ప్రజలు వేగంగా వెళ్లాలనే ఆత్రుతలో జాగ్రత్త విషయాన్నే మరచి పోతున్నారు. తగినంత అవసరం ఉన్నా, లేకపోయినా, వేగంగా కారు వగైరాలను నడపడం యిప్పుడు నాగరకతా లక్షణంగా మారి పోయింది.

రైలును అందుకోవడానికో, లేకపోతే డాక్టరును కల్సుకోవడానికో యెక్కువ వేగంతో కారును నడపడంలో కొంత అర్థం ఉంది. అంతేకాని గంటల తరబడి క్లబ్బుల్లో బాతాఖానీ కొట్టడానికి, కారును గంటకు అరవై మైళ్ళ వేగంతో నడప వలసిన అవసరం యేమీ లేదుకదా! అటువంటి చోట్లకు వెళ్ళడంలో ఆలస్యం అయినా వచ్చే నష్టం యేమీ లేదు.' అన్నాడు చిదంబరం.

'అందుకే కారు, బస్సు మొదలైన వాటిని వేగంగా నడిపే వారి మీద కొన్ని జోక్సు ఉన్నాయి' అన్నాడు చంచల్రావు.

'ఏమిటా జోక్సు'? అని చూడామణి ప్రశ్నించాడు.

'నేను నడిపితే కారు మెరుపు లాగ వెడుతుంది' అన్నాడు ఒక డ్రైవరు.

'అవును. అందుచేతనే ఆ కారు తరువాత పిడుగులాగ యే చెట్టుకో గుద్దుకొంటుంది' అని రెండవ ఆసామీ సమాధానం యిచ్చాడు' అని చంచల్రావు తిరిగి చెప్పడం ప్రారంభించాడు.

'ఒక ఆసామీ కారును గంటకు అరవై మైళ్ళ వేగంతో నడుపుతున్నాడు. అప్పుడు అతనికి యేదో చప్పుడు వినిపించింది. వెంటనే అతను కారువేగాన్ని తగ్గించాడు. అప్పుడు యే చప్పుడూ వినిపించలేదు. తిరిగి అతను అరవై మైళ్ళ వేగంతో కారు నడపగా చప్పుడు మళ్ళా వినిపించింది.

ఇంజనులో యేదైనా లోపం ఉన్నదేమోనని అతను కారును ఒక మెకానిక్కుకు చూపించాడు మెకానిక్కు ఆ కారును నడిపాడు కాని అతనికి యే చప్పుడూ వినిపించలేదు.

'నాకు యే చప్పుడూ వినిపించడం లేదు. యింజనులో లోపం యేమీ లేదు' అన్నాడు మెకానిక్కు.

'తక్కువ వేగంతో వెళ్ళినప్పుడు నాకూ చప్పుడు వినిపించలేదు.'

'అయితే మీకు చప్పుడు యెప్పుడు వినిపించింది?'

'అరవై మైళ్ళ వేగంతో వెళ్ళినప్పుడు చప్పుడు వినిపించింది'.

'ఓ! అదా! అది గంటల చప్పుడులెండి. దానికీ కారుకు యేమీ సంబంధం లేదు.'

'గంటల చప్పుడు యేమిటి'?

'మీరు అరవై మైళ్ళ వేగంతో వెడుతున్నప్పుడే కదా, చప్పుడు వినిపిస్తుంది. మీరు అంత వేగంగా వెడుతున్నప్పుడు యేక్షణంలో తన అవసరం మీకు వస్తుందేమోనని యమధర్మరాజు దున్నపోతు మీద యెక్కి మీకూడా వస్తూంటాడు. ఆ దున్నపోతు మెడలో కట్టిన గంటల చప్పుడు మీకు అప్పుడు వినిపిస్తుంది. అని మెకానిక్కు చెప్పాడు' అని చంచల్రావు చెప్పాడు.

'ప్రమాదాలు జరగడం కేవలం డ్రైవర్ల నిర్లక్ష్యం వల్లనే కాదు. అప్పుడప్పుడు డ్రైవరు సారా మొదలైన వాటిని త్రాగి కూడా డ్రైవు చేస్తుంటారు. అది కూడా చాలా ప్రమాదాలకు కారణం అవుతుంటుంది.' అన్నాడు చూడామణి.

'అవును సారా త్రాగి డ్రైవు చేసే వారిమీద కూడా కొన్ని జోక్సు ఉన్నాయి' అన్నాడు చంచల్రావు.

'ఏమిటా జోక్సు?

ఒక వంతెన మీద ఒకలారీ డ్రైవరు సారా

త్రాగి లారీని వేగంగా నడుపుతూ ఒక మనిషికి గుద్దించి వేశాడు. అతనికి బాగా దెబ్బలు తగిలాయి. పోలీసులు కేసు పెట్టారు.

'గంటకు పదిమైళ్ళ కంటే యెక్కువ వేగంతో వెళ్ళకూడదని ఆ వంతెన వద్ద బోర్డు ఉంది కదా ! అది నీకు కన్పించలేదా?' అని మేజిస్ట్రేటు లారీ డ్రైవరును ప్రశ్నించాడు.

'సార్! నాకు అప్పుడు రోడ్డే కన్పించలేదు. ఇంక బోర్డు యెక్కడ కన్పిస్తుంది' అని లారీ డ్రైవరు సమాధానం యిచ్చాడు' అంటూ చంచలావు తిరిగి చెప్పడం ప్రారంభించాడు.

'ఒక ఆసామీ బాగా తాగిన మత్తులో ఉండి కారును నడుపుతున్నాడు. రోడ్డుకు పక్కగా ఉన్న టెలిఫోను బూతువద్ద కారు ఆపి, టెలిఫోను బూతులోనికి అతను వెళ్ళాడు. కొంచెం సేపు అయిన తరువాత అతను కారులో యెక్కి చూడగా స్టీరింగు, స్పీడ్ మీటరు వగైరా కన్పించలేదు. వెంటనే అతను తిరిగి టెలిఫోను బూతులోకి వెళ్ళి పోలీసులకు ఫోను చేశాడు తన కారు తాలూకు స్టీరింగు వగైరాలను యెవరో యెత్తుకొని పోయారని అతను పోలీసులకు చెప్పి తిరిగి వచ్చి కారులో పడుకొన్నాడు.

తరువాత కొంచెం సేపటికి అక్కడికి పోలీసులు వచ్చారు. వెంటనే ఆ ఆసామీ తన స్టీరింగు వగైరాలు దొంగిలింపబడిన విషయాన్ని తిరిగి పోలీసులకు చెప్పాడు. అప్పుడు పోలీసు ఆఫీసరు అతనితో యిలాగ అన్నాడు.

'అయ్యా! మీరు ఉన్నది కారుయొక్క వెనుక సీటు. ముందు సీటువద్ద స్టీరింగు వగైరాలు ఉన్నాయి. ఎవరూ వాటిని దొంగిలించ లేదు'.

'ఓ! అలాగా?' అంటూ ఆ ఆసామీ అప్పుడు ముందు సీటు వైపుకు చూశాడు' అని చంచలావు చెప్పాడు.

'అవును అటువంటి స్థితిలో ఉండి యెవరైనా కారును నడిపితే ప్రమాదాలు జరగవా?' అని ప్రశ్నించాడు చిదంబరం.

'కారు మొదలైన వాటిని వేగంగా నడపడం వలన కలిగే నష్టాలను గురించి అమెరికాలో కొన్ని వివరాలను ప్రకటించారు' అంటూ చూడామణి చెప్పడం ప్రారంభించాడు.

'గంటకు నలభై మైళ్ళ వేగంతో నడిపితే ఒక కారు నాలుగు సంవత్సరాలు మన్నుతుందనుకో. గంటకు అరవై మైళ్ళ వేగంతో నడిపితే అదే కారు ఒకసంవత్సరం మాత్రమే మన్నుతుంది. ఎక్కువ వేగంగా వెళ్ళడం వలన కారుయొక్క ఆయుర్దాయం కూడా తగ్గిపోతుంది'.

'గంటకు యిరవై అయిదు మైళ్ళ వేగంతో కారును నడుపు తున్నప్పుడు ప్రమాదాలు జరిగే అవకాశం ఒక వంతు ఉంటుందనుకో. గంటకు నలభైరెండు మైళ్ళ వేగంతో కారును నడిపితే ప్రమాదాలు జరిగే అవకాశం యేడువంతులు అవుతుంది. అంటే యేడు రెట్లు పెరుగుతుందన్న మాట' అన్నాడు చూడామణి.

'రోజూ యెన్నో ప్రమాదాలు జరుగుతున్నాయి ఎంతో మంది ప్రజలు వీటివలన చనిపోతున్నారు. ఈ సంగతి లారీ డ్రైవర్లకు బస్సుడ్రైవర్లకు కూడా తెలుసును. అయినా వారు అంత వేగంగా యెందుకు లారీలను బస్సులను నడుపుతున్నారు?' అని ప్రశ్నించాడు చిదంబరం.

'ఖాండవ వన దహనానికి సంబంధించిన దేవ రహస్యం ఒకటి దానికి కారణమయి ఉంది. అన్నాడు చూడామణి.

'ఏమిటా దేవరహస్యం?' అని చిదంబరం ప్రశ్నించగా చూడామణి చెప్పడం ప్రారంభించాడు.

'ఒకప్పుడు శ్వేతకి అనే రాజు పన్నెండు సంవత్సరాల పాటు యజ్ఞం చేశాడు. ఆ పన్నెండు సంవత్సరాలు శ్వేతకి నిర్విరామంగా ఘృతధారలతో అగ్నిని సంతృప్తి పరచాడు.

ఆ నేతిని త్రాగడం వలన అగ్ని సంతృప్తి పొందాడు కాని దాని వలన అతనికి అజీర్ణవ్యాధి కలిగింది. 'ఘృతపానం వలన కలిగిన అజీర్ణవ్యాధికి ఖాండవదహనమే తగినమందు' అని బ్రహ్మదేవుడు అగ్నిహోత్రునికి చెప్పాడు.

ఆ ఖాండవవనం యింద్రదరక్షితమై తక్షక పరివార వృత్తమై ఉంది. బ్రహ్మదేవుని సలహా ప్రకారం అగ్నిహోత్రుడు ఖాండవ వనాన్ని దహించడం ప్రారంభించాడు. ఆ వనంలోని జీవులు అగ్నిని చల్లార్చడానికి యెన్నో విధాలుగా ప్రయత్నించాయి. ఏనుగుల గుంపులు తొండాలతో నీరు తెచ్చి జల్లాయి. పాములు కూడా అగ్నిహోత్రుని మీద నీరు జల్లాయి. వీటికితోడు యింద్రుడు పంపిన మేఘాలు కూడా వర్షించాయి. వీటి వలన అగ్నిహోత్రుని ప్రయత్నాలు యేడు సార్లు వ్యర్థమయ్యాయి.

తరువాత అగ్ని బ్రహ్మదేవుని సలహాను అనుసరించి కృష్ణార్జునులను శరణుకోరాడు. వారు అతనికి అభయమిచ్చారు. ఖాండవ వన దహన సమయంలో యింద్ర తక్షకులను యెదుర్కొనడానికి అగ్నిదేవుడు కృష్ణార్జునులకు గాండీవమూ, అక్షయతూణీరమూ, రథమూ మొదలైన వాటిని యిచ్చాడు.

కృష్ణార్జునుల సహకారంతో అగ్నిహోత్రుడు ఖాండవ దహనాన్ని దహించడం తిరిగి ప్రారంభించాడు. కృష్ణార్జునులు కూడా జీవకోటిని వధించి అగ్నికి సహాయం చేశారు. ఆ సమయంలో దేవేంద్రుడు మేఘాలను పంపి వర్షాన్ని కురిపించాడు. అర్జునుడు తన అస్త్రాలతో వర్షాన్ని నిరోధించాడు.

ఈ విధంగా అగ్నిహోత్రుని వలన ఖాండవ వనంతో పాటు, అందులో ఉన్న సింహ వ్యాఘ్ర భల్లూక మత్తేభాది వన్యమృగాలు, పక్షులు, కీటకాలు కూడా నశించిపోయాయి. పదిహేను రోజుల పాటు సాగిన ఖాండవ వన దహనం నుంచి బయట పడిన ప్రాణులు మయుడు, అశ్వసేనుడు శారఙ్గకనామం గల నాలుగు పక్షులు మాత్రమే.

ఖాండవ దహనంలో చనిపోయిన జీవులన్నీ తరువాత సూక్ష్మ రూపంలో శ్రీకృష్ణుని వద్దకు వచ్చి యిలాగ ప్రశ్నించాయి.

'దేవదేవా! శ్రీకృష్ణా! నువ్వు అగ్నికి తోడ్పడి మమ్మల్నందర్నీ సంఘమరణానికి గురి చేశావు. మేము నీకు గాని, మరొకరికిగాని చేసిన అపకారం యేమిటి? మమ్మల్ని యెందుకు యిలాగ అకాల మరణానికి గురి చేశావు?'

'జీవులారా? మీరు యే అపకారమూ చేయలేదు. సంతత ఘృతపానం వలన అగ్నిహోత్రుడు ఆరోగ్యం చెడిపోయింది. అగ్నిహోత్రుని ఆరోగ్యం ప్రజాక్షేమానికి అవసరం అందుచేత ప్రజాక్షేమాన్ని కోరి మిమ్మల్ని చంప వలసి వచ్చింది. అంతేకాని మీరు చేసిన అపచారం యేమీ లేదు.'

'సరే జరిగి పోయినదేదో జరిగిపోయింది. అయినా మమ్మల్ని యితరుల నిమిత్తం నువ్వు చంపావు కాబట్టి మాకు తగిన నష్ట పరిహారాన్ని యివ్వాలి' అని ఆ జీవులు శ్రీకృష్ణుని ఒత్తిడి చేశాయి.

'అలాగే. మీకు కావలసిన నష్ట పరిహారం యేమిటో కోరుకోండి'.

'ఇందులో మేము ప్రత్యేకంగా కోరుకోవలసింది యేముంది? రామావతార సమయంలో నువ్వే వారికి చెప్పావు కదా దెబ్బకు దెబ్బ అని. అలాగే మాకు కూడా యిప్పించ వలసి ఉంది'.

'మీకు కావలసిందేమిటో స్పష్టంగా చెప్పండి' అన్నాడు శ్రీకృష్ణుడు.

'ప్రజల క్షేమం కోసం మా ప్రాణాలను నువ్వు తీశావు కాబట్టి ప్రజల ప్రాణాలు మా చేతిలో ఉండేటట్లుగా వరం కావాలి'.

అప్పుడు శ్రీకృష్ణుడు కొంచెం సేపు ఆలోచించి యిలాగ అన్నాడు.

'ఆ వరం యిప్పుడు సాధ్యం కాదు. కలియుగంలో మీరు బస్సు డ్రైవర్లుగాను, లారీ డ్రైవర్లుగాను జన్మిస్తారు. అప్పుడు బస్సుల్లో ఉండేవారి ప్రాణాలే కాకుండా, రోడ్డు మీద నడిచే వారందరి ప్రాణాలు కూడా మీ చేతుల్లో ఉంటాయి' అని ఖాండవ వన దహనాన్ని గురించి చూడామణి చెప్పాడు.

'ఇప్పటికే చాలా ఆలస్యం అయింది' అంటూ చంచలావు లేవగానే మిగిలిన యిద్దరూ అతన్ని అనుసరించారు. ●

# వారఫలం

## 21-11-1969 శుక్రవారం మొదలు
## 27-11-1969 గురువారం వరకు

**మేషం**. వృత్తి వ్యాపారాల్లో మీ కార్యక్రమాలు అనుకొన్నట్లుగా నెరవేరుతాయి. పోటీ వారిలో గౌరవం లభిస్తుంది. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. రాజకీయ వ్యవహారాలు బాగా ఉంటాయి. ప్రయాణాలు అనుకూలంగా ఉంటాయి. సంతోషకరమైన వార్తలను వింటారు.

స్త్రీలకు:— కుటుంబ వ్యవహారాలు బాగా ఉంటాయి. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**వృషభం**: వారం ప్రారంభంలోనే వృత్తి వ్యాపారాల్లో చికాకులు యేర్పడి తరువాత సర్దుకొంటాయి. మీ తాలూకు వస్తువులు పోయే ప్రమాదం ఉంది. వృత్తిలో ఆదాయం బాగా ఉంటుంది. ఉద్యోగంలో గౌరవం లభించ గలదు. విద్యా వైజ్ఞానిక రంగాల్లో మీ కృషి రాణించగలదు.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగా ఉండదు. బంధుమిత్రులను కల్సుకొంటారు.

**మిధునం**: వ్యాపారంలో ఆదాయం బాగా ఉంటుంది. సాహసముతో కూడిన వ్యవహారాలు లాభిస్తాయి. వారం మధ్యలో అధిక వ్యయం జరుగుతుంది. ఉద్యోగంలో చికాకులు యేర్పడతాయి. వారం ఆఖరులో తిరిగి అనుకూల పరిస్థితి యేర్పడుతుంది. ప్రయాణాలోచనలు చేస్తారు.

స్త్రీలకు:— కుటుంబ వ్యవహారాల్లో కార్యభారం పెరుగుతుంది. పాటివారిలకి గౌరవం బాగా ఉంటుంది.

**కర్కాటకం**: అన్ని వ్యవహారాల్లోను గౌరవ ప్రాబల్యాలు బాగా ఉంటాయి. స్థిరాస్థి వ్యవహారాల్లో అనుకూలత లభిస్తుంది. నూతన విషయాలను తెల్సుకొంటారు. ఆర్థిక వ్యవహారాలు బాగా ఉంటాయి. వారం ఆఖరులో ఆకస్మికంగా చికాకులకు గురికాగలరు.

స్త్రీలకు:— దైవ కార్యాలు నెరవేరుతాయి. అధిక వ్యయం చేస్తారు.

**సింహం**: అన్ని వ్యవహారాల్లోను అనుకూలత లభిస్తుంది. ప్రయాణం ద్వారా కార్యసాధన చేయగలరు. ఉద్యోగంలో గౌరవం బాగా ఉంటుంది. సాహసముతో కూడిన వ్యవహారాలు అనుకూలంగా ఉంటాయి. విద్యా వైజ్ఞానిక రంగాల్లో మీ కృషి రాణిస్తుంది.

స్త్రీలకు:— వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు. సంతానానికి సౌఖ్య సంతోషాలు లభిస్తాయి.

**కన్య**: లాభం రావలసిన వ్యవహారాల్లోనే నష్టం రావచ్చును. ప్రయాణాల్లో శ్రమ కలుగుతుంది. వారం మధ్యలో వ్యాపారంలో ఆదాయం బాగా ఉంటుంది. మిత్రులకు సహాయం చేయగలరు. అధికారుల వలన జరగవలసిన వ్యవహారాలు సులువుగా నెరవేరుతాయి.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగా ఉండదు. సంతోషకరమైన వార్తలను వింటారు.

**తుల**: భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాలు బాగా ఉంటాయి. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. వారం మధ్యలో ఆందోళనకు గురికాగలరు. వృత్తిలో శ్రమ కలుగుతుంది. అధిక వ్యయం జరుగుతుంది. వారం ఆఖరులో తిరిగి అనుకూల పరిస్థితులు యేర్పడతాయి.

స్త్రీలకు:— కుటుంబ వ్యవహారాలు బాగా ఉంటాయి. నూతన విషయాలను తెల్సుకొంటారు.

**వృశ్చికం**: వృత్తిలో శ్రమ మీద అనుకూలత లభిస్తుంది. రాజకీయ వ్యవహారాల్లో చికాకులు యేర్పడతాయి. సాంఘిక కార్యక్రమాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. వ్యాపారంలో ప్రయోజనం గల సంభాషణలను జరుపగలరు. వారం ఆఖరులో సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం రావస్తుంది.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగా ఉంటుంది. ఆడంబరం కోసం వ్యయం చేస్తారు.

**ధనుస్సు** వృత్తి వ్యాపారాల్లో మీ కార్యక్రమాలు నిరాటంకంగా నెరవేరుతాయి. సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. పాటివారితో మాట పట్టింపులు తగవు. ఉద్యోగంలో యితరుల నిమిత్తం శ్రమకు గురికాగలరు. వారం ఆఖరులో ఆర్థిక వ్యవహారాలు అనుకూలంగా ఉంటాయి.

స్త్రీలకు:— కుటుంబ వ్యవహారాలు బాగా ఉంటాయి.సంతానానికి సౌఖ్య సంతోషాలులభిస్తాయి.

**మకరం** మీరు యెంతగానో ఆశించిన వ్యవహారాల్లో సలితం సామాన్యంగా ఉంటుంది. పాటివారిలో గౌరవం లభిస్తుంది. వారంమధ్యలో వ్యాపారంలో ఆదాయం బాగా ఉంటుంది. నూతన విషయాలను తెల్సు కొంటారు. రాజకీయ వ్యవహారాల్లో ప్రతిపక్షాల సంచలనం పెరుగుతుంది.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగా ఉంటుంది. దైవ కార్యాలు నెరవేరుతాయి.

**కుంభం**: వ్యాపారంలో అనుకూల వార్తలను వింటారు. అధికారుల వలన జరగవలసిన వ్యవహారాలు సులువుగా నెరవేరుతాయి. ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాలు తగవు. ఉద్యోగంలో గౌరవం బాగా ఉంటుంది. ప్రయాణాలు అనుకూలంగా ఉంటాయి. వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి.

స్త్రీలకు:— వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు. బంధువులకు సహాయం చేస్తారు.

**మీనం**: వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కల్సు కొంటారు. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. రాజకీయ వ్యవహారాలు బాగా ఉంటాయి. మిత్రులకు సహాయం చేస్తారు. స్థిరాస్థి వ్యవహారాల్లో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. ప్రయాణాలోచనలు చేస్తారు.

స్త్రీలకు:— శుభ కార్యాల విషయంలో అభివృద్ధిని సాధించ గలరు. సంతోషకరమైన వార్తలను వింటారు.

మహేష్ ●

# మీ పాపని జలుబుతో బాధపడనిస్తారా?

అక్కరలేదు..!

**విక్స్ వేపొరబ్ జలుబు భారాన్ని వెంటనే తొలగిస్తుంది. ముక్కుదిబ్బడ పోగొడుతుంది. తేలిగ్గా ఊపిరి తీసుకోనిస్తుంది. పాపహాయిగా, చక్కగా నిద్రపోతుంది.**

విక్స్ వేపొరబ్ లో వున్న ఓ గొప్పగుణం: జలుబు బాధలు కలిగే ముక్కు, గొంతు. గుండె. వీపుల మీద రాయచ్చు. ముక్కుదిబ్బడ ఎంత తొందరగా పోయి. జలుబు బాధ తగ్గి పాప ఎంత హాయిగా వుంటుందో మీ అంతట మీరే చూడగలరు. విక్స్ వేపొరబ్ ప్రత్యేకత ఏమంటే జలుబు బాధలు తీర్చడానికి అది రెండు విధాల పనిచేస్తుంది:



బయట-చర్మం మీద



లోపల-ఊపిరి ద్వారా

1. బయట-చర్మం మీద: విక్స్ వేపొరబ్ వెచ్చదనం జలుబు వల్ల కలిగే వంటి నొప్పుల్ని తగ్గిస్తుంది. హాయినిస్తుంది.

2. లోపల-ఊపిరి ద్వారా: విక్స్ వేపొరబ్ మందుఆవిరిగా మారుతుంది. ఊపిరి పీల్చినప్పుడల్లా ఈ మందుఆవిరి వంట్లో ప్రవేశించి. ముక్కుదిబ్బడను పోగొడుతుంది. గొంతు నొప్పిని, గుండెల్లో బరువుని తగ్గిస్తుంది. ఈ విధంగా మీ జలుబు భారాన్ని మాయంచేస్తుంది.

### ప్రత్యేక గమనిక



బాగా గుణం కనబడ్డానికి ముక్కు మీద. గొంతు దగ్గర విక్స్ వేపొరబ్ రాయండి. గుండెమీద, వీపు మీద విక్స్ వేపొరబ్ బాగా రుద్దండి. జలుబు భారం పూర్తిగా తీరేవరకు విక్స్ వేపొరబ్ వాడండి.




## విక్స్ వేపొరబ్ - జలుబుబాధలకి ఆధునిక ఔషధం




మీ రెప్పుడేనా ట్రూడీ చదువుతారా?

మీ సంగతి తెలియదుగాని నే నెప్పుడూ చదువుతాను. పుస్తకమంత విషయాన్ని ఒక్క బొమ్మలో చెప్పేస్తాడు మహానుభావుడు! పక్కింటిని చిటికెనవేలుతో ఏలే మహానుభావురాలు ట్రూడీ పక్కింటావిడ. ఆవిడగారి కక్కరలేని విషయం లేదు—వస్తువు లేదు. సమయం కాని సమయం లేదు. కప్పు పంచదారకి, బ్రెడ్‌కి, జామ్‌కి, వంట గిన్నెలకి ఒకటేమిటి అన్నీ సొంత ఇంట్లోంచిలాగా పట్టుకు వెడుతూవుంటుంది. పెద్ద దాన్నన్న ఒక్క ఘనత మినహా ఆవిడకేం హక్కుంది! చివరికోసారి 'ట్రూడీ నీ వీధి తాళం కప్పచెవి వోసారివ్వు' అంటూ వీధిలోకి వెడుతున్న ట్రూడీని అడుగుతుంది. 'ఎందుకు?' అని అడిగే లోపలే—'దానికో డూప్లికేటు చేయిస్తాను మళ్ళీ బయటికి వెళ్ళినప్పుడేదైనా అవ



సరం అయితే ఇబ్బందిగా ఉంది!' అంటుంది. అంతటి ఘటికురాలైన పొరుగింటావిడ ఉంటే ట్రూడీ లాగే బిక్క మొఖం వేయడం తప్పించి ఏం చేయలేం. కార్యార్థుల దృఢనిశ్చయం ముందు సామాన్యులు గడ్డిపోచలే. తల వంచక తప్పదు. కాని యిలా పరపీడనే పనిగా పెట్టుకున్న వారికి తల వంచడం చేతకానితనం. అంతే కాదు కొరివితో తల గోక్కోవడంలాంటిదే. ఒకటికి పదిసార్లు తల వంచుకుపోతే పరిష్కరింపబడేవి కావు ఇలాంటి బుర్లిల చేష్టలు. అలా పరిష్కారం అయేవి కొన్ని వున్నాయి. ఓ అయిదు రూపాయలు ఇదే పనిగా బదులడిగే వ్యక్తికి వోసారిచ్చేస్తే అది తీర్చేదాకా తిరిగి అడగడన్న ధైర్యం వుంటుంది. (ఉండేది అనాలేమో; ఈ మధ్య వో పెద్దమనిషి వో లేఖ పంపాడు. 'పది రూపాయలిచ్చావు. మిగిలిన తొంభయీ పంపు' అని. దీన్ని చూస్తే నేనేమో బాకీ తీరుస్తున్నా ననుకునేరు! రామ రామ! అదేం కాదు. వోసారడిగితే పది రూపాయలిచ్చిన పాపానికి ఫలితం ఇది! అంచేత!) చిన్న చిన్న చేబదుళ్ళు యిచ్చి పుచ్చుకోవడాలు ప్రతి సంసారంలోనూ సర్వసామాన్యమే. కాని వాటికో దారీ తెన్నూ ఉంటుంది. గ్యాస్ పొయ్యి దగ్గర నుంచి అప్పు పట్టుకెడితే యివతలి సంసారం గడవడం ఎలా?'

కార్యార్థుల ధోరణులు చూసే వారికి హాస్యాస్పదంగా తోచడం కూడా సహజమే నిజానికి జోడు ఎక్కడ కరుస్తూందో తొడుక్కున్న వాడికి గని తెలియదు కదా. కుంటుతున్నాడని నవ్వడం తప్పించి మనం అర్థం చేసుకోలేం... 'ఏమిటి మీరు కూడా అలా ఉట్టినే ఆలోచిస్తూ కూర్చున్నారు?' అంటూ దిగబడి గంటల తరబడి మన టైమూ వారి టైమూ వృధా చేస్తారు. మనం మొహమాటానికి భరిస్తాం—ఈ అనవసర సంభాషణ అంతా కార్యార్థి అవసరార్థం భరిస్తాడు!... ఇద్దరి గోలా ఒకటే—ఒకరికి ఏం కావాలి? అని అడగా



లని ఉంటుంది. ఎదుటివారికి 'ఇదికావాలని' సూటిగా అడగాలని ఉంటుంది కార్యార్థుల అప్రోచ్ రకరకాలు. ఒకళ్ళిలా అప్రస్తుత ప్రసంగంలో పడేసి చివరికి అడుగుతారు. కొందరలా కాదు. తమ జీవిత చరిత్రనీ తరతరాల చరిత్రనీ క్లుప్తంగా విశదీకరించి చివరికిలా అడగవలసి వచ్చిందని వ్యక్తం చేస్తారు. కొందరు వీరముష్టిలాగా వో పదిలా పారేయ్ అంటూ డిమాండ్ చేస్తారు కొందరు ఉబ్బేసి బోల్తాకొట్టిస్తారు (సులభ పద్ధతి). కొందరందర్నీ తిత్తిపొడిచి చివరి కడుగుతారు (లేకుంటే నువ్వూ ఆ జాబితాలో చేరతావు సుమా అని!)... ఏదేమైనా కార్యవాది డిప్లొమసీ నిజంగా గమనించ తగ్గది. ఈ డిప్లొమసీ జీవితంలో ఇతర విషయాలకి అన్వయింప చేస్తే జీవితమార్గం సుగమం అవడమే




కాదు—అందరిచేతా హాహో అనిపించుకోవడం కూడా సులభం.

ఈ డిప్లొమసీ నేర్చుకోవలసింది ముఖ్యంగా గృహిణులు. ఇరుగు పొరుగులతో సాఫీగా కాలక్షేపం చేయడానికిదెంతేనా అవసరం. మా అత్తయ్య ఎవరికీ వో రూపాయ యివ్వడంగాని పుచ్చుకోవడంగాని నే చూడలేదు. అంతేకాదు — ఆమెగారికి చుట్టుపక్కల స్నేహితులు లేకపోవడం కూడా చూడలేదు. 'ఏమిటి కిటుకు మామయ్యా? అత్తయ్యనెవరూ కానీ అప్పు అడగరు. నా జీతం అంతా అందుకే పంచవలసి వస్తూంది' అని అడిగితే — 'అది నేర్చే చిట్కాతల్లీ, నువ్వూ కార్యవాదిగా ఉండకల్గాలి. వారు నీ దగ్గర తీసుకోవాలని ఎంత పట్టుగా ఉంటారో అంత నేర్పుగానూ నువ్వు యివ్వవేమో అనుకోగల్గాలి. అంతే' అన్నాడు మామయ్య. ■

# ఆశించిన అదృష్టం

ప్రభ



అదృష్టం కొందర్ని వెదుక్కుంటూ వస్తే, కొందరు అదృష్టాన్ని వెతుక్కుంటూ వెళ్తారు, ఈ కోవలోనే చేరుతుంది మాలతి గథ.

మాలతి ఓ మధ్యతరగతి కుటుంబంలో పదిమంది సంతానంలో కడగొట్టు పిల్లగా పుట్టింది. ఏటా బాలింత, చూలింతగా వుంటూ వచ్చిన గృహిణి ఖాయిలారోగికింద దిగజారిపోతే కాస్త ఎదిగి వచ్చిన ఆడపిల్లలే కుటుంబ సంరక్షణ చేస్తుండేవారు. ఏటా పురిటికర్చు, మరోఖర్చు తగిలి ఆడంబరంగా వాటిని నిర్వర్తిస్తూ బంధువులు పదిమందితోనూ సెహబాస్ అనే పొగడ్తలూ వింటూ ఉప్పొంగిపోయే యజమాని తలనిండుగా అప్పులు పేరుకుపోయేసరికి పొంగు తగ్గి అప్పులాళ్ల చేతుల్లోంచి ఇవతల పడేసరికి స్థిరాస్తి చాలా కరిగిపోయింది. ఇల్లు అయ్యవారి నట్టిల్లులా మిగిలిపోయింది. మొదటినుంచి కష్టపడి ఎరుగని మొగపిల్లలు సంపాదన తమ ధ్యేయం కాదనే దురభిప్రాయంతో అందినంతవరకు చిక్కించుకుని ఊరి మీద పడి జల్సా చేస్తుండేవారు.

ముందు జాగ్రత్త చూసుకోకుండా సంసారాన్ని గుల్ల చేసుకున్నందుకు ఆ తర్వాత చింతిస్తూ, కష్టార్జితంతో కుటుంబ పోషణ చేస్తూ బరువెక్కిన సంసారభారాన్ని గానుగెద్దులా ఈడ్చుకొస్తున్నాడు తండ్రి. అతనిబాధ చూడలేక ఆ భారంలో తలో కొంత పంచుకోవాలనే సదుద్దేశంతో అతని తోబుట్టువులు, తమ్ముళ్లు, ఆడపిల్లల్ని మగపిల్లల్ని కోడళ్లరూపంగా అల్లుళ్లరూపంగా చేసుకుని అతని బాధని చాలావరకు తగ్గించేసారు. మాలతి, మరో ఆడపిల్ల, ఒక మగపిల్లవాడు ఇంకా చిన్నవాళ్లు అయినందువల్ల వాళ్లుమాత్రం తల్లితండ్రిదగ్గరే వుండిపోయారు.

పట్టుమని అయిదేళ్లన్నా లేని మాలతి ఆశలుమాత్రం ఆకాశాన్ని అంటుతుండేవి. తనకి మంచిబట్టలు లేవని గునిసేది. 'మెడలోకి ఒక్క గొలుసన్నా లేకపోతే ఎలా, రాధా, జయ, లీల వాళ్లుచూడు ఎన్నెన్ని నగలు పెట్టుకుంటారో నాకైతే ఒక్కటీ లేదు' అని పేచీ పెట్టేది. మాలతికంటె పెద్దపిల్లకి తమ కుటుంబ విషయాలు తెలుసు. పరిస్థితుల్ని అర్థంచేసుకోగల తెలివివున్న పిల్ల 'వాళ్లు వున్నవాళ్లు, ఒకటి కాకపోతే పదిరకాల నగలు ధరిస్తారు. మనకెలా వస్తాయి. మనకి డబ్బేది? నాన్న పని చేస్తే ఈ తిండైనా దొరుకు

తున్నది; లేకపోతే తిండిక్కూడా మాడాల్సి వచ్చేది తెలుసా' అని చెల్లెలికి బోధించి ఆ పిల్లమనసు మార్చడానికి ప్రయత్నించేది కాని మాలతి మనసుకి అంత తెలివేది? అందుకే అన్నంలోకి సరియైన కూర లేదని, అది లేదని యిదిలేదని దేనికో దానికి పేచీపెట్టి నానా గొడవ చేసేది. తమ అసమర్థతకు లోలోపలే కుళ్ళిపోయే వాడు తండ్రి, పిల్లలు అందివచ్చేసరికి ఏమీ మిగల్చలేకపోయానే అని.

తల్లి నయాన్న భయాన్న బోధించేది 'నువ్వు పెద్దదానివయ్యాక బాగా చదువు కుని మంచి మొగుణ్ణి చేసుకుని మెడ నిండా ఇన్ని నగలు పెట్టుకుని, పట్టుచీర కట్టుకొని లక్ష్మీదేవిలా తిరుగుతావు కాని, మరి ఇప్పుడు పేచీ పెట్టకూడదమ్మా. ఇప్పుడు పేచీ పెడితే ఆతర్వాత దేవుడికి కోపంవచ్చి నీకేమీ యివ్వడు' అనేది. ఆ మాటలకు లొంగిపోయిన మాలతి ఎంతో పొంగిపోతూ 'మరి నాకు చప్పున పెళ్ళి చెయ్యవే' అనేది, పెళ్ళికూడా ఒక ఆట వస్తువే అన్నట్లు. ఆ మాట మరిపించ డానికి మరిన్ని అబద్ధాలు అందంగా కల్పించి ఊరించేది తల్లి. అదంతా నిజమే అని ఆ రోజుకోసం ఎంతో ఆశగా, ఆత్రు తగా నిరీక్షించసాగిందా పిల్ల.

ఆ వూళ్ళో మోతుబరి రైతుల్లో మోతుబరి అయిన నరసయ్యనాయుడి కూతురికి పెళ్ళి చాల ఘనంగా ఆడంబ రంగా అయ్యింది. పెళ్ళి అయిదురోజులూ, విందులు, వినోదాలు, భోగం మేళాలతో సాయంత్రం గానకచేరీలతో, భారీ యెత్తున ఏర్పాటు చేసిన ఊరేగింపులతో ఇటువంటి పెళ్ళి ముందు జరిగివుండదు, ఇకముందు జరగదు అనేంత గొప్పగా జరిగింది. ఆ పెళ్ళి అయిదురోజులూ, మేజువాణిలదగ్గర, ఊరేగింపుతోనూ హడావిడిగా తిరిగిన మాలతి 'అమ్మా...అమ్మా...నా పెళ్ళి కూడా ఇలా చేయవే' అంది తల్లి గడ్డం పట్టుకుని బ్రతిమాలుతూ. తెలిసీ తెలి యని ఆ పిల్ల కోర్కెకు, ఆ వయసులోని అత్యాశకు ఓ చెంప విషాదంగా నవ్వుకుంటూ మరో చెంప అసలు నీకు పెళ్ళంటూ చేసి చూసి ఆనందించే యోగం మాకుం దామ్మా అని నిట్టూరుస్తూ 'అలాగే నమ్మా' అని మాటిచ్చిందామె.

ఆ మాటని యిరుగు పొరుగున వున్న తన స్నేహితురాళ్ళందరికి చెప్పి చెప్పి అలిసిపోయిందా పిల్ల.

కాలం ఎవరికోసమూ ఆగదు. కప్ప దాట్లు వేస్తూ అది జరిగిపోతూనే వుంది. ఋతువులు తమ ధర్మాన్ని నిర్వర్తి స్తూనే వున్నవి. అయిదేళ్ళ మాలతి పన్నెండేళ్ళ బాలకుమారయ్యింది. వికసిస్తూ వికసిస్తూ వున్న మొగ్గలాంటి యవ్వన సౌరభం ఆపిల్లదేహాన్ని వ్యాపిస్తూ వున్నది కొంచెం కొంచెంగా.

ఆ వూళ్ళో వున్నది మిడిల్ స్కూలు ఒక్కటే. ఇంకా పైకి చదువుకోవాలనే పిల్లలు, మూడు మైళ్ళ దూరంలో వున్న హైస్కూల్లో చదువుకుంటారు. యిరుగు పొరుగు తన ఈడుపిల్లలు ఆ స్కూల్లో చేరిన రోజున తనూ ఆ స్కూలుకి వెళ్తానని మారాం చేసింది. అమ్మో! ఆ స్కూల్లో చదువంటేమాటలా? పుస్తకాలు బోలెడన్ని కావాలి. సరియైన బట్టలుండాలి, అన్నం టికి మించి భోజన సదుపాయాలు బాగా వుండాలి. ఇవన్నీ వుంటేనే ఆ స్కూల్లో కెళ్ళి చదవాలి, మనకంత స్తోమతలేదు. అయినా చదివి నువ్వేమి చేస్తావమ్మా ఈ చదివింది చాలులే' ఒక్కమాటలో తేల్చే సారు తల్లీ తండ్రీను.

'తను బాగా చదువుకుంటె మంచి మొగు డొస్తాడు' అనే నమ్మకాన్ని బాగా జీర్ణిం చేసుకున్న మాలతి తననింకా చదివించక పోతే, నూతిలో దూకుతానన్నది, అన్నం తినకుండా మాడి చస్తానని బెదిరించింది, అయినా ఆ అమ్మాయికోర్కె నెరవేర లేదు. ఇక చేసేదిలేక గుండెరాయి చేసుకున్నదా పిల్ల. కాని ఆశ చావని మనసు. బడికి వుత్సాహంగా వెళ్ళే పిల్లలను చూసి బోలె డంత దిగులుపడి పోయేది. చేతిలో ఇన్ని పుస్తకాల దొంతరతో తనుకూడా వాళ్ళల్లో ఒక పిల్లగా గెంతుతూ హుషారుగా స్కూలు కెళ్తున్నట్లు రాత్రి కలగని పగలు అది నిజం కాలేదని మహా దుఃఖపడి పోయేది. హైస్కూల్లో చదువుకునే పిల్లలు రోజూ స్కూల్లో జరిగే సంఘటనల్ని వర్ణించి చెప్తుంటె ఆ అదృష్టానికి తను నోచుకో నందుకు బాధగా, కోపంగా, ఉక్కు రోష పడి పోయేది 'నేనూ చదువుకుంటా, మీ కంటె ఎక్కువే' వణికే గొంతుతో పెంకిగా అనేది 'ఎప్పుడు? ముసలిదాని వయ్యాకా!' వెటకారంగా, వ్యంగ్యంగా నవ్వేవాళ్ళు పిల్లలు.

'కాదు, పెళ్ళి చేసుకున్నాక చదువు కుంటాను, మునసీబుగారమ్మాయి హేమ లాగ' నిశ్చలంగా జవాబిచ్చేది.

ఇద్దరాడపిల్లల పెళ్ళి ఒకేసారి చేయా లని ప్రయత్నిస్తున్నాడు తండ్రి. మాలతి ఊహా పథంలో సామాన్యులు ఆనడం లేదు. అందం, చదువు, పెద్దహోదాగల వుద్యో గం, కార్లమీద షికార్లు, మెడనిండా నగలు, పట్టుచీరలు గల జీవితంకోసం అటువంటి జీవితాన్ని అందించే భర్తకోసం అంత రాంతరాలల్లో తహతహలాడిపోతుంటె, బావలు, అన్నయ్యలు తీసుకొచ్చే వరుళ్ళు అతి సామాన్యంగా వున్నవాళ్ళ జీవితాలు ఎలా నచ్చుతాయి? ఎంతమందిని తీసు కొచ్చినా నాకు నచ్చలేదు పొమ్మని నిక్క చ్చిగా చెప్పేసేది. తల్లి ఇరుగు పొరుగు ఆడవారితో చెప్పించేది 'ఎవరో ఒకర్ని ఒప్పుకోవాలిగాని, అన్నీ వద్దంటూ కూర్చుంటె ఎలా?' అని.

'పెళ్ళంటె జీవితకాలం పంట, ఎవరో ఒకర్ని ఒప్పేసుకోవడానికి ఇది ఒక్కరోజులో అయిపోయేదికాదు. ఏం? మీ పిల్లల కిలాగే చేస్తారా? కట్నం యిచ్చుకొనే శక్తి లేకపోయినా తలకిమించిన సంబంధా లను వెదికి ఎందుకు చేస్తున్నారు? మీ పిల్ల ల్లాగే సుఖపడాలని మంచి మొగుడు రావా లని నాకు మాత్రం ఆశలుండవా?' కాలికి వేస్తే మెడకి, మెడకి వేస్తే కాలికి లంకె వేసే ఆ పిల్ల వితండ వాదానికి అదిరి పోయిన వాళ్ళూ యిక ఆ పిల్లకి బోధిం చడం మానివేశారు.

ఇంటిముందు ఒక పందిరి లేకుండా బ్యాండ్ మేళం లేకుండా, వూరేగడానికి, పూలరథం లేకుండా జరిగే పెళ్ళి ఓ పెళ్ళేనా అనే తేలికభావం వుంది మాలతిలో.

పెళ్ళంటె, అబ్బాయి అమ్మాయి చూసుకోవాలి పరస్పర మనోభావాలు, అభి రుచులు బాహాటంగా వెల్లడించుకోవాలి, అప్పుడు మనసులు కలిసాయనుకుంటె పెళ్ళి అదైనా ఎలా జరగాలి? ఇంటినిండా పెళ్ళిజనం, చెవులు హోరెత్తించే మైకు, మధ్య మధ్య మేమూ వున్నాము అని

# ఆశించిన అదృష్టం

జ్ఞాపకం చేసే బ్యాండ్ వాయిద్యాలు, ఆకాశాన్ని అందుకుంటున్నదా అనే భ్రమ కొల్పే వూరేగింపుపూలరథం, వాటితో పెళ్లి చమక్ చమక్‌మంటూ అయ్యిందంటె అప్పుడు ఫలాన మాలతిపెళ్లి ఇంత గొప్పగా అయ్యింది, ఇంత ఖర్చయింది అని నలుగురూ చెప్పుకుంటె అదీ పెళ్లి ముచ్చటంటె' ఇలా వుండేది మాలతి ఆలోచన.

మాలతికంటె పెద్దపిల్లకు సంబంధం కుదిరింది. వరుడికాస్తిపాస్తులు లేవు, వుంటానికి చిన్న యిల్లువుంది. మేస్టరు పని చేస్తున్నాడు. అతనే మాలతికికూడా సంబంధం తీసుకొచ్చాడు. అబ్బాయికొట్టే చదువు లేదు. దున్నుకోవడానికి సరిపడా పొలం వుంది. ఫర్వాలేదు. భుక్తికి లోటులేని సంబంధం అనేలా వుంది. మాలతిని చూస్తూనే 'నేను ఈ పిల్లను తప్పించి మరో పిల్లను చేసుకోను. నాకు కానీ కట్నం అక్కర్లేదు'. అని మాటకూడా యిచ్చేసాడు. 'ఆ అబ్బాయిని అస్సలు పెళ్ళాడను' అని పట్టుబట్టుక్కూర్చుంది మాలతి. ఇప్పుడలాగే అంటారు ఆ మూడుముళ్ళు పడితే అన్నీ వాటంతటవే సర్దుకుంటాయి. నీ కెందుకు ఆ అబ్బాయికే ఖాయం చెయ్యి. అని పెద్ద తలకాయలు సలహా చెప్పాయి. మాలతి తండ్రికి అదీ పాయింటుగానే కనిపించి ఇద్దరికీ కలిపి ముహూర్తం పెట్టించేసాడు.

సామాన్యులయింట పెళ్లి సామాన్యంగానే జరిగిపోవడం సహజమే. చెల్లెళ్ల పెళ్లినిమిత్తం ఒకరు డబ్బు, మరొకరు, అప్పాలు, మరొకరు పిండివంట ఖర్చులు తలోటి పంచుకున్నారు. అక్కలు, అన్నలూను. ముహూర్తం రోజులొంది గంటల్లో కొచ్చింది. తల్లి తండ్రి, అక్కలు, బావలు, అన్నలు, వదినలు వాళ్ల సంతానంతో యిల్లంతా సందడిగా హడావుడీగా వుంది, ఒక్కమాలతి శూన్యమైన మనసు తప్పించి. నిల్చున్నా కూర్చున్నా మరేంచేస్తున్నా 'ఈ పెళ్లి తప్పిపోతే? తప్పించుకునే మార్గమే లేదా? ఎలా...? ఎలా...?' అని తపించిపోతూ వున్నది.

ముహూర్తం వేళ 'మాలతి కనిపించడం లేదు' అనే వార్త సన్నగా బ్యలుదేరి కాస్సేపటికి ఊరంతా వ్యాపించిపోయింది. 'ఎక్కడికి వెళ్తుంది? సరిగ్గా చూడండి—ఏ స్నేహితురాలింటికైనా వెళ్లిందేమో, లేదా ఎక్కడన్నా పడుకుని ఆదమర్చి నిద్ర పోతున్నదో' కావల్సినవాళ్ళూ, దగ్గరవాళ్లు—ఇరుగు పొరుగు ఇళ్లు గాలిస్తే—మరికొందరు తోటలు, దొడ్లు, చెరువులు నూతులు వెతికారుకాని, ఎక్కడా ఆ పిల్ల జాడ కనిపించలేదు. కనిపిస్తుంది అనే ఆశా సన్నగిలి పోగానే ఆ తండ్రి సిగ్గుతో, అవమానంతో — దుఃఖంతో— కోపంతో కుప్పగా కూలిపోయాడు. అంత మంది చుట్టాల మధ్య కలిగిన ఈ పరాభవానికి అతనెంతో క్రుంగిపోయాడు.

తన బిడ్డలవల్ల సంతృప్తి, సంతోషం, గర్వం కలగాలని ప్రతి తండ్రి కోరుకుంటాడు. అందుకు విరుద్ధంగా సిగ్గుని— అవమాన అవహేళనలు — దుఃఖం — ఆ బిడ్డలవల్ల కలిగిన్నాడు ఆ తండ్రి పడే ఆవేదన వర్ణనాతీతం. ఆ బాధని ఎవరూ తీర్చలేరు. అందుక్కారణమైన ఆ బిడ్డను తను ఎప్పటికీ క్షమించలేడేమో.

పీటలమీది పెళ్లి ఆగిపోకుండా పెళ్లికెదిగి వున్న మరో అమ్మాయిని మాలతికి బదులుగా పెళ్లిపీటమీద కూర్చోపెట్టి ఆ తంతు సక్రమంగా కానిచ్చేశారు— అంతా పూనుకుని. ఆ కాస్సేపు నవ్వు నటించినా ఆ తర్వాత ఆ తండ్రి కోలుకోనే లేదు. ఎవరు తనెదురుగా నవ్వినా తన్ను చూసే నవ్వారని, తన కూతురు చేసిన పనికి తన్ని ఏవగించుకుంటున్నారు అనే ఇన్‌ఫీరియార్టీ కాంప్లెక్సులో బాధపడి పోయేవాడు. ఆ దిగులే అతన్ని మంచంమీదకి చేర్చింది.

కొన్ని నెలలు గడిచి పోయాయి. ఆ యింట్లోవాళ్లూ ఆ వూరివాళ్లు అంతా క్రమేపీ మాలతి సంగతే మర్చి పోయారు. అసలు ఆ వూళ్లో మాలతి అనే పిల్లే లేదు అన్నంత మరుపులో కొచ్చేసారు.

ఏదైనా అంతే! మొదట్లో వున్న ఆసక్తి కాలం గడిచే కొలది తగ్గుతూ వస్తుంది. అది కాల ప్రభావమూ లేక — మానవనైజమే అంటో! 'మాలతి ఎవరితోనో లేచి పోయిందని, ఫలాని వూళ్లో కనిపించిందని, ప్రక్కనే ఎవరో వున్నారని, పట్టి బజారుసరుకులా తయారై పోయిం

"తని" చెవులు కొరుక్కున్న వాళ్లే "పాపం ఆ పిల్ల ఎందులోనో పడి ప్రాణాలు తీసుకుని వుంటుంది. లేకపోతే బ్రతికి వుంటే ఒకసారి కాకపోతే ఒకసారైనా రాదూ? తప్పకుండా చచ్చిపోయి వుంటుంది. ఇష్టం లేని పెళ్లి చేస్తే ఆడపిల్ల ఇంతకన్న ఏం చేయగలదు? రోజులు మారాయి. మారిన కాలంతో పాటు మనుష్యులూ మారాలి. లేకపోతే యిటువంటి అనర్థాలే వస్తాయి. లేచిపోవడాలు—ప్రాణం తీసుకోవడంవంటివి' అని కూడా సానుభూతి చూపెట్టసాగారు లోకులు.

కాని వున్నట్టుండి ఆ వూళ్లో ఒక నాటుబాంబు పేలినంత సంచలనం అకస్మాత్తుగా బైలుదేరింది. అందుక్కారణం ఇన్నాళ్లూ చచ్చిపోయింది అని సానుభూతి పొందుతున్న మాలతి బ్రతికివుండడమేగాక తను వలానిచోట సురక్షితంగా వున్నట్లు తెలియపరుస్తూ వాళ్ల అమ్మ నాన్నలకి ఉత్తరం రాయడంవే.

'నేను ఒక అనాథాశ్రమంలో ఆశ్రయం పొందాను, ఇక్కడే నేను కుట్లు అల్లికలు, చదువు నేర్చుకుంటున్నాను, మిమ్మల్నందరినీ చూడాలని మనసు పీకుతున్నది. నేను అక్కడకురాలేను అమ్మా, నీవు బైలుదేరి రండి అంటూ తనచదువు వగైరా అక్కడ మనుష్యులగురించి ఇంత పెద్ద లెటర్ రాసుకొచ్చింది మాలతి.

ఆ వుత్తరం చదువుతూనే వళ్లు పటపట కొరుకుతూ తండ్రి 'సిగ్గులేకపోతే సరి చేసిన నిర్వాకం చాలక దాన్ని చూట్టానికి వెళ్లాలట, నాపరువుతీసి నన్ను నవ్వులపాలు చేసింది కాకుండా ఇదొకటా' అంటూ ఆ ఉత్తరం చించి పోగులుపెట్టాడు.

కాని కన్నప్రాణం గనుక తల్లి 'నా తల్లి అక్కడ ఏంబాధలు పడుతున్నదో ఒక్కసారి వెళ్లిరండి ఎంత బెంగటిల్లిపోయిందో ఎంత చిక్కిపోయిందో' అని ఎంతో ప్రాధేయపడింది, బ్రతిమాలింది, కొడుకుల్ని పిలిపించి చెప్పింది కాని ఆ తండ్రి మనసు కాస్తకూడా కరగలేదు పైగా కొడుకులు అన్నారు కదా 'లేచిపోయిన దాన్ని ఏమొహం పెట్టుకు చూసి రమ్మంటావమ్మా, అక్కడకెళ్తే మన బంధువులు ఊరుకుంటారా? అదెప్పుడైతే ఈ గుమ్మం దాటిందో అప్పుడే దానికి మనకి దూరం అయిపోయింది. ఇక దాన్ని మర్చిపోమ్మా' అని. ఆడది, నిస్సహాయురాలు, అయిన ఆ తల్లి కన్న మమకారాన్ని చంపుకోలేక గుండె రాయి చేసుకోలేక లోలోపలే కుళ్లిపోయేది.

మరో రెండేళ్లు గడిచి పోయాయి. ఈమధ్యలో మాలతి తండ్రి చనిపోయాడు. అందరిలోకి ఆఖరివాడు మాలతి చిన్నన్నయ్య సంసార బాధ్యతని భుజాలమీద కెత్తుకున్నాడు.

తను ఏదో పరీక్ష ప్యాసయ్యిందని తనకి చిన్న ఉద్యోగంకూడా దొరికిందని మీరు రమ్మంటె వస్తాను' అని మళ్లీ రాసింది ఉత్తరం మాలతి.

'కడసారపుదాన్ని అప్పుడైనా చూస్తాను రమ్మని రాయరా, దానికి అభిమానం ఎక్కువైన మీరు రమ్మనిరాస్తేగాని రాదు' అని పట్టుపట్టింది తల్లి అప్పుడూ ఆమెమాట వినలేదు ఎవరూ 'ఇప్పుడిప్పుడే నలుగురి దృష్టిలోపడి గౌరవాన్ని పొందుతున్నాము అది గుమ్మంలో కొచ్చిందంటె' లేచిపోయినదాన్ని యింట్లో పెట్టుకున్నారని నలుగురూ వేలెత్తి చూపిస్తే మనకెంత సిగ్గుచేటో ఆలోచించమ్మా' అంటూ ఆమె కోర్కెను నొక్కేసారు ఈసారి కూడా.

వీళ్లు సమాధానం యివ్వకపోయినా తనుమాత్రం అప్పుడప్పుడూ ఉత్తరాలు రాస్తూనేవుంది మాలతి. ఆ ఉత్తరాల్లో ఎక్కువగా తన ఉద్యోగంగురించి. తనని అందరూ ఎంత గౌరవంగా ఆదరించేది వర్ణించుకొస్తూ మీరుతప్ప నన్ను అందరూ గౌరవంగా అభిమానంగా బాగానే చూస్తున్నారు' అన్న కబుర్లే వుండేవి.

డాక్టర్ కబుర్లు

# రేస్ మోటారుకారు డ్రయివర్ల అర్హతలు

ఇది వైద్యానికి సంబంధించిన విషయమే! రేసులలో కార్లు నడిపేవారి ఆరోగ్యం బాగా ఉండాలి దీనికి కొన్ని అర్హతలని నిర్ణయించారు-

**చూపు**-రెండు కళ్ళకి 20/40 చొప్పున 'చూపు శక్తి' ఉండాలి. రంగులు తెలియాలి దూరం అంచనా వెయ్యగలగాలి. 150 మైళ్ల స్పీడుకి ఈ చివరి గుణం చాలా ముఖ్యం.

**మనస్సు, నరాలు** - చురుకుతనం, అప్రమత్తత, విచక్షణ అవసరం దీనికోసం విద్యుత్ యంత్రాలతో మెదడుని పరిశీలిస్తారు అయితే, ఒక విచిత్రమయిన పరీక్షకూడా ఒకటిఉంది. ఎప్పుడు తమదే తప్పు అనుకునే వారు ఈ రకం సారథ్యానికి పనికిరారుట!

**అంగబలం**-చేతులలో, జబ్బలలో బలం బాగా ఉండాలి. దానికి కావలసిన వ్యాయామాలు ఎన్నో ఉన్నాయి. కీళ్లు



చక్కగా పని చెయ్యాలి (ఒకే కాలుఉన్న డ్రయివర్లని కొన్ని సమయాలలో స్వీకరిస్తారు!)

హెచ్. ఎల్. హార్డెన్‌సోన్

(కాపీరయిటు)

# ఆశించిన అదృష్టం

రాలు రావడంలేదు. తల్లి మాలతిమీద బెంగతో పూర్తిగా మంచం పట్టేసింది. 'మాలతీ, అమ్మడూ, ఎక్కడున్నావమ్మా? నీ కోపం ఇంకా పోలేదా తల్లీ ఈ అమ్మ మీద, ఒక్కసారి రావూ, నీ కోసం కలవరించే ఈ కళ్లకి చల్లదనాన్నివ్వవూ?' అని కలవరించేది మేల్కొనే.

'పిల్లని నన్ను రానివ్వరమ్మా, వీళ్లు రాక్షసులు. వాళ్లకి కావల్సింది గౌరవంగాని, మమతలుకావు, నీవు వస్తే వాళ్ల కులం పోతుంది వాళ్ల పిల్లలకు పెళ్లిళ్లుకావు, అదీ వీళ్ల భయం. 'అని గొణుగుతూ తిట్టేది, రెండురోజుల నుంచి ఆ గొణుగుడూ పోయింది' ఎవరన్నా దగ్గర కెళ్లి 'ఎలావుంది?' అని పలకరిస్తే కళ్లింత చేసి చూస్తుంది, అంతే.

'ఈవిడ పని అయిపోయింది. కాని దేని కోసమో తపిస్తున్నది ఆ ప్రాణి' చూడ వచ్చిన అమ్మలక్కలు గుసగుస లాడే వాళ్లు. అలా ఆరోజు ఉదయం పదిగంట లయ్యింది. పాతబడిన ఆ యింటిముందు ఒక టాక్సీ దూసుకొచ్చి ఆగింది. ఆ వీధిలో పిల్లా పిచికా అంతా దానిచుట్టూ రయ

కారుతలుపు తీసుకుని ముందు సూటు వాలా ఆ వెనకాల దంతపు బొమ్మలాంటి అమ్మాయి యువతల కొచ్చారు. సూటువాలా టాక్సీ డ్రైవరుకి ఏదో చెప్తున్నారు. అమ్మాయిమాత్రం చిరునవ్వు చిందులాడే వదనంతో పిల్లగుంపుని చీల్చుకుని చకచక ఆయింటి గుమ్మంలోకి నడిచింది. కారు శబ్దానికి యువతలకొచ్చిన స్త్రీలు ఆశ్చర్య సంభ్రమాలనుంచి తేరుకునే లోపలే ఆ అమ్మాయి ఆ యింటితో తనకెంతో పరిచయం వున్నదానిలా చనువుగా లోపల కెళ్లి పోయింది.




తల్లి మంచంచుట్టూ విషణ్ణ వదనాలతో కూర్చున్న కొడుకులు, కూతుళ్లు ఆగంతుకురాల్ని చూస్తూనే తడబడ్తూ ఆ మంచాన్నుంచి కాస్త దూరంగా తొలిగారు. ఈ సమయంలోనే అమ్మా అనే ఆర్తనాదంతో ఆ చక్కెర బొమ్మ వచ్చి ఆ రోగిష్టి దేహాన్ని చుట్టేసింది. 'ఎవరూ?' ఆ గొంతుకోసమే తన నిరీక్షణ అన్నట్లు ఎక్కడో గుండె లోతుల్లోంచి వచ్చిన క్షీణ స్వరం, ఆ ఆకారాన్ని గుర్తుపట్టిన దానిలా కళ్లు రెపరెపలాడిస్తూ 'అమ్మ...డూ... మాలతి' అంది. ఆనందోద్వేగంతో తబ్బిబ్బు లవుతూ.

'ఎవరూ! మన మాలతే? అరే... గుర్తుపట్టలేక పోయామే, ఆ అబ్బాయెవరూ? మెళ్లో నల్లపూసలున్నాయి కూడా. భర్తకాబోలు అబ్బ ఎంత మారి పోయింది? సన్నగా, రివటలా వుండేది. ఇప్పుడు బాగా రంగూ వచ్చింది, వళ్లు వచ్చింది కాస్త పొడుగు సాగిందికూడా?' ఎవరికి వాళ్లు మనసులో అనుకుంటూ సంతోషంతో ఉక్కిరి బిక్కిరై పోతుంటె వాళ్లకి, ఆ సమయంలో మాలతి లేచి పోయిందని, ఆ అమ్మాయిని యింట్లోకి రానిస్తే నలుగురూ 'ఏమంటారు' అనే భయ సంకోచాలుగాని ఏ కోశానా లేవు. ఎప్పుడో తప్పిపోయిన మనిషి హఠాత్తుగా వాళ్ల ముందుకొస్తే ఎంత సంతోషంగా, తృప్తిగా వుంటుందో అంతకు వేయి రెట్లధికంగా సంతోషిస్తూ వళ్లంతాకళ్లు చేసుకుని స్వయంకృషితో పైకివచ్చిన మాలతిని ఆమెభర్తని అవలోకిస్తూ వుండి పోయారు ఆమె చుట్టాలంతా...' ●

ఇది 3 నెలలప్పుడు గిరీష్ పటము. అతనికి వారం వయస్సప్పటినుండే అమూల్ స్ప్రే పట్టడం ప్రారంభించేరు. అతని పెరుగుదల అద్భుతంగ ఉందండి.

# ఇప్పుడు చూడండి ఎలాగున్నాడో!

"ఉల్లాసమైన అమూల్ స్ప్రే అబ్బాయి. ప్రతిరోజు క్రొత్త, క్రొత్త విషయాలు నేర్చుకొంటున్నాడు." అంటున్నారు 13-నెలల గిరీష్ తండ్రి, శ్రీ దిలీప్ చొబల్.

మీ బిడ్డయొక్క పుట్టినప్పటి బరువు ఆరునెలలో రెట్టింపు కావాలి. సంవత్సరం తిరిగేటప్పటికి మూడు రెట్లవ్వాలి. అమూల్ స్ప్రే సంతులితమైన, సులభంగ జీర్ణమయ్యే దుగ్ధాహారము. శరీరము బాగుగ పెరుగుటకు ముఖ్యమైన ప్రోటీను ఇందులో ఎక్కువగా ఉంది.

అమూల్ స్ప్రే వాసియైన స్ప్రే-డ్రైయింగ్ పద్ధతిద్వారా తయారుచేయబడుతుంది. ఈ పద్ధతి యిప్పుడు అమెరికాలో అన్ని శిశువాహారాలు తయారుచేయుటలో ఉపయోగిస్తున్నారు. ఈ పద్ధతి ద్వారా పాల-ప్రోటీను ఎక్కువగా నిలిచియుంటుంది.

వేలాదిమంది తల్లులు ఇప్పుడు అమూల్ స్ప్రే తమ పాలకు బదులుగాగాని, అనుబంధ ఆహారంగాగాని ఉపయోగిస్తున్నారు— మొదటివారం నుండే. అందుచేతనే పరిచయం చేసిన పెండేళ్ళలోపునే అమూల్ స్ప్రే దేశంలో ఎక్కువగా అమ్ముడుపోయే శిశువాహారమయింది.




## అమూల్ స్ప్రే

తల్లిపాలకు అద్భుతమైన మారుపేరు.

[illegible] విద్యార్థులు [illegible] వేసుకుని ఆగ్రా వెళ్ళడానికి సర్వ సిద్ధం చేసుకున్నారట. అయితే డబ్బు యివ్వని విద్యార్థులు కొందరు జబర్దస్తీగా పిక్నిక్ కారులో ఎక్కారట. దిగమంటే 'నో' అన్నారట. దాంతో అది కొట్లాటగా మారింది. విజయపాల్‌సింగ్ అనే అతను, గనేష్ అనే అతను చేరి మోహన్‌లాల్ అనే అతన్ని కత్తితో పొడిచి పారిపోయారట. పిక్నిక్ కాస్తా పీకనొక్కుగా మారింది.




## రోడ్డు ప్రమాదాలు

26 ఏళ్ళ రాన్‌సాహి అనే అతను ఢిల్లీలో రోడ్డుమీద నడుస్తున్న నేరానికి ఒక బస్సొచ్చి అతన్ని గుద్ది చంపేసిందట. 27 వ తేదీన కాష్మీర్ గేటు ప్రాంతంలో ఒక 50 ఏళ్ళ వృద్ధుని మీద బస్సు ఎక్కి విజయం సాధించిందట. జనం నడవడానికి సొరంగాలో— లేక ఎత్తైన గ్యాలరీలో కట్టాలిక—

## నర బలి

నరబలి ఒక్కటి కనుక యిస్తావో యిక నీ అదృష్టాన్ని పట్టేవాడే లేడు చూసుకో అని ఒక జ్యోతిష్కుడు చెప్పిన ముక్కను పట్టుకుని తాండూరు తాలూకా [ హైదరాబాదు ] దాంగా అనే వూరిలో ఒకాయన ఎల్లప్ప అనే ఒక హరిజన యువకుణ్ణి పట్టుకుని, గునపంతో తెగేసి బలి యిచ్చాడట. హతుని అన్నగారు మాజీమంత్రి శంకర్‌దేవ్‌కి యిచ్చిన ఫిర్యాదులో వ్యక్తుల పేర్లు కూడా రాసి వున్నదట. ఈ విషయంలో సుప్రీమ్‌కోర్టు జడ్జి పరిశోధనకు కలిపించుకోవాలని, గాంధి వర్ధంతి కాలంలో యీ హింసాకాండ అవమానమనీ [ఆవక జరగచ్చునని కాదు ] సంజీవయ్య అన్నారట.




## అర్ధరాత్రి అత్యాచారం

ఢిల్లీలో సర్దార్ బజారులోని కాష్మీరీలాల్ అనే ఆయన యింటి తలుపును అర్ధరాత్రి ఎవరో దబదబ బాదారట. ఆయన భార్య వెళ్ళి తలుపు తీసేసరికి, యిద్దరు అపరిచిత వ్యక్తులు లోపలకు జొరపడి కాష్మీరీలాల్‌ను బలవంతంగా బయటకు తీసుకు వెళ్ళి కత్తితో పొడిచి, పారిపోయారట. కాష్మీరిలాల్ కేకలకు జనం పోగై ఆయన్ని ఆసుపత్రిలో చేర్చారు. ఆయన్ని పొడిచిన యిద్దరూ 25 ఏళ్ళ త్రిలోక్ అనే అతను 21 ఏళ్ల చుమ్మాయ అనే అతనూ అని తేలి— వారికోసం పోలీసులు గాలిస్తున్నారు. అలా ఎందుకు పొడవాల్సి వచ్చిందో మాత్రం తెలియలేదు.

* * *

తన సోదరికి పుట్టిన బిడ్డ చనిపోతే ఆ బిడ్డ శవాన్ని ఆటోరిక్షాలో యింటికి తీసుకు వెళ్తున్న మాధవి అనే ఆమెను మార్కెట్టు సిస్టర్లు ఆపారట. ఆ రోజు శకటాలేవీ నడవరాదని చెప్పి. ఆమె విషయం ఎంత చెప్పినా వినిపించుకోలేదట. ఆమె ఆ పసికందు శవాన్ని భుజాన్న వేసుకుని రోడ్లన్నీ నడిచి, యింటికి చేరిందట. ఒళ్ళు జలదరించే యీ సంఘటన కాలికట్టులో జరిగింది.

* * *

31 ఏళ్ళ పద్మమ్మ అనే ఆవిడ తన తొమ్మిది, సంవత్సరాల పిల్లను, రెండున్నర ఏళ్ళ పిల్లాడిని తొమ్మిది నెలల పిల్లను నూతిలో తోసేసి, ఆనక తను కూడా దూకేసిందట. శబ్దానికి చేరిన ఇరుగూ పొరుగూ రెండున్నర సంవత్సరాల పిల్లనుమాత్రమే రక్షించ గలిగారట. ఈమె భర్త పాలిటెక్నికల్ కాలేజీలో పని చేస్తున్న ఒక ప్యూనట. కుటుంబ కలహాలే యీ దారుణకాండకు కారణమని తేలింది. ఇది బెంగళూరులో జరిగింది.

## కురుక్షేత్రంగా మారిన భూమి తగాదా

మర్కారాకు 18 మైళ్ళ దూరంలో వున్న ఐడగ బెరామ్నన్ అనే వూళ్ళోకి రెండు కుటుంబాల మధ్య పుట్టిన భూమి తగాదా అధికమై కర్రలు, కర్రలూ కలుసు కున్నాయట. దీనితో ఒక వ్యక్తి తుపాకి కాల్పుకు గురై చనిపోయాడట. అలవాడు మాత్రం రెండు కుటుంబాలకు మధ్య పుట్టిన భూమి తగవు కాదేమిటి అంత పెద్ద కురుక్షేత్ర యుద్ధాన్ని జరిపించి, సర్వ నాశనం చేయించింది—

## చెట్టు కాని చెట్టు

తంజావూరులో అనంతస్వామి [అక్షయ] దేవస్థానానికి చెందిన ఆరు ఎకరాలు పొలం ఒక వ్యవసాయదారునికి సాగుబడికి యిచ్చారట. అయితే భూమి చట్టం ప్రకారం ఐదు ఎకరాలకు ఎక్కువ వున్న భూమిని ట్రస్టుకు స్వాధీనం చేయాలనీ, కనుక ఆ ఎకరం యిచ్చివేయాలనీ, ఆ శాఖఅధికారి ఆజ్ఞ యిచ్చారట. ఈ కేసు మద్రాసు హైకోర్టులో విచిత్రమైన తీర్పును పొందింది. వ్యవసాయ దారుడు అరటితోటను పెంచుతున్నాడనీ, చట్ట ప్రకారం ఫల సంబంధమైన పంట పండించవచ్చనీ, ఫిర్యాదు ప్రకారం అరటి చెట్టు — చెట్టు జాతి కాదని, వృక్షశాస్త్ర ప్రకారం ఎన్‌సైక్లోపేడియానిఘంటు ప్రకారం అరటి జాతి చెట్టు జాతికి చెందదనీ, కనుక ఆ పంట పండించడంవల్ల వ్యవసాయదారు ఆరో ఎకరం ప్రభుత్వానికి యివ్వనక్కర లేదనీ జడ్జి యిస్మాయిల్— విత్ సర్మాయిల్ తీర్పు చెప్పారట. విన్నారా— అరటి నివాళమంచి చెట్టనకండిస్మీ.... నవ్విపోగలరు నలుగురూ....



## అల్సరు. కాన్సర్‌లకి కారణం

డబ్బు లేక, ఆదా కోసం ఏదో ఆహారం తిని, కడుపు మంటను చల్లార్చుకుంటే అది కాన్సరు, అల్సరు వంటి వ్యాధులకు దారితీస్తోందని టోక్యోకి చెందిన డాక్టర్ కూరిటా ప్రయోగాల మూలకంగా తేల్చి చెప్పారట. రోజంతా విపరీతంగా కష్టపడి, తిండి దగ్గరకు వచ్చేసరికి ఏమీ లేక, వున్నది తినడానికి టైము లేక ఆదరా బాదరా తినేవారి ఆహార నాళాలు దెబ్బతిని, అల్సరు పుట్టుందని ఆయన అన్నారట. ఎనిమిది గంటల కన్నా రోజులో ఎక్కువ పని చేసేవారికి, అందునా రాత్రికాలం ఎక్కువ పని చేసేవారికి అల్సరు—కాన్సరు ఎక్కువగా వస్తోందని కూడా ఆయన అన్నారట.

* * *

1967 జనాభా లెక్కల ప్రకారం ప్రపంచ జనుల సంఖ్య 3420 మిలియనులనీ— యింకా 31 సంవత్సరాలలో అనగా 2,000 సంవత్సరం



నాటికి యీ సంఖ్య రెట్టింపయి, 6,130 మిలియను లవుతుందని అమెరికాలో లెక్కలు కట్టారు. అవదా! దేశ దేశాలలో వున్న యీ నాటి బాలబాలికలందరూ — రేపటి పుట్టబోయే పిల్లల తల్లులు, తండ్రులే కదా!...

* * *

లారీ ఆపకూడని చోట రోడ్డు మీద ఆపి, తీయమన్నా తీయక ట్రాఫిక్కుకు ఆటంకం కలిగించాడని ఆ లారీ డ్రయివర్ని పోలీసు యిన్‌స్పెక్టరు పిలిచి, ఓ లెంపకాయ కొట్టాడట. ఒకే దెబ్బతో డ్రయివరు నేలని కరుచు కున్నాడట. ఈ దృశ్యాన్ని చూసిన జనం ఒళ్ళు పొంగి, ఆ యిన్‌స్పెక్టరు మీద రాళ్ళవర్షం కురిపించారట. ఆత్మరక్షణకోసం ఆయన దగ్గర్లో వున్న పోలీస్టేషనుకు పారిపోతే, ఆ జాగాలో మిగిలి వున్న ధగధగలాడే ఆయన మోటారు సైకిలుకి నిప్పెట్టి, కాలి నాశనం అయ్యేవరకూ వేడుక చూస్తూ నిల్చున్నారట ప్రజలు. ఇది బెంగళూరు నగరం నడి మధ్య జరిగింది.

# 'తెలుగు చిత్రాలలో నటించడానికి ప్రస్తుతం తీరికలేదు'



# జయలలిత



'ప్రేక్షకుల అభిమానమే నా అదృష్టం'

కుమారి జయలలిత యికే తెలుగు చిత్రాలలో నటించదా? అనేది సందేహం ప్రేక్షకులకు, తెలుగు చిత్రాలలో నటించడానికి ఆమె అంగీకరించదేమోనన్న అనుమానం నిర్మాతలకు కల్గినట్లు తెలిసింది. ఆమెను కలిసి అసలు విషయాన్ని తెలుసుకుందామనుకుని గత బుధవారం జయలలిత గారికి ఫోను చేశాను. అప్పుడు ఉదయం తొమ్మిది గంటలు. ఆవిడ హాలుకి వెళ్ళారండీ అని ఆవిడ మేనేజరు జవాబిచ్చారు. నేను వెంటనే హాలుకి బయల్దేరాను. ఆమె హాల్లోని ఫ్లోర్‌లోవుంది. ఏకాంతంగా కూర్చుని ఏదో ఆలోచిస్తున్నట్లుంది. 'క్షమించండి. ఒక్క పదినిమిషాలు స్పేర్ చేయగలరా?' అని అడిగాను. 'ఓ. ఎస్. మీకేంకావాలి?' అంటూ కుర్చీ చూపించింది.

ప్ర: మీరు ముమ్ముందు తెలుగు చిత్రాలలో నటించరట. నిజమేనా?

జ: శుద్ధ అబద్ధం. అలాంటి నిర్ణయానికి నేను రాలేదు.

ప్ర: మీరు ఎక్కువగా తమిళంలో నటిస్తారని, తెలుగులో యీ మధ్య ఒప్పుకోటంలేదని విన్నాను?

జ: నేను తమిళంలో నటిస్తున్న చిత్రాలన్నీ యింతకుముందు అంగీకరించినవే. తెలుగు నిర్మాతలు వస్తున్నారు. మీరు మాతో సహకరించగలిగితే, రెండు మూడు మాసాల్లో పిక్చరు పూర్తి చేస్తామంటారు. అలాగయితే నా కాల్‌షీట్లు ఎడ్జెస్ట్ కావండీ అని చెప్తున్నాను.

ప్ర: కాల్‌షీట్లు కొన్ని యిటు అటుగా యిస్తానని చెప్పి అంగీకరించవచ్చుగా?

జ: మాటచెప్పి తర్వాత మాట నిలబెట్టుకోవాలిగాని అనవసరమయిన మాటలు వదడం దేనికని.

ప్ర: మీకు తెలుగు చిత్రాలలో నటించాలన్న ఆసక్తి ఉందా?

జ: నాకూ తెలుగు చిత్రాలలో నటించాలనేవుంది. 1970 మార్చి వరకు ఖాళీ లేదు. ఆపైన తప్పకుండా నటిస్తాను.

ప్ర: మీరు ఏప్రిల్‌లో విదేశాలకు వెళ్ళడంలేదా?

జ: ఒక తమిళ చిత్రం అవుట్‌డోర్ షూటింగు సందర్భంగా వెళ్ళవలసి వుంటుందనుకున్నాను. ఇంకా తేలలేదు.

ప్ర: మీరు 'అలీబాబా నలభైదొంగలు' చిత్రంలో ఒకపాట పాడారట. అందరూ మెచ్చుకుంటున్నారు. మీకు సంగీతం వచ్చా?

జ: సరదాకి ఒకపాట పాడాను. నేను సంగీతం ఎవ్వరిదగ్గర నేర్చుకోలేదు.

ప్ర: మీరు తీరికసమయాల్లో ఏం చేస్తారు?

జ: తీరికదొరకడం దుర్లభం. ఏకాస్త తీరిక ఉన్నా ఇంగ్లీషు నవలలను చదువుతాను. ప్రేక్షకులు వ్రాసే ఉత్తరాలను చదివి, వారి అభిప్రాయంయొక్క వివిధ రూపాలను తెలుసుకుంటాను.

ప్ర: మీకు చిత్రలేఖనం వచ్చట?

జ: అవును. వచ్చండి. అప్పుడప్పుడు బొమ్మలు గీస్తుంటాను.

ప్ర: ఇంత చిన్నవయస్సులో ఇంత పేరు సంపాదించడానికి దోహదం చేసింది?

జ: ప్రేక్షకుల అభిమానం నా అదృష్టం. నేను యింతటి వున్నత స్థితి పొందుకోడానికి మా అమ్మగారుకూడ ఒక కారణం.

ప్ర: మీ అభిమాన 'కళ' యేదో చెప్పగలరా?

జ: భరతనాట్యం. నేను ఒకరోజు గ్యాపుదొరికినా నాట్యంతో 'కావేరి తంద కళై చెల్వి' నృత్య నాటికను ప్రదర్శిస్తాను.

ఇంటర్‌వ్యూ: శ్రీనివాస్



'మాతృదేవత'లో ఎన్. టి. రామారావు, సావిత్రి

చిత్రసమీక్ష :

# మాతృదేవత

కథ కథకోసమా? ఒకే ఒక పాత్ర కోసమా? ఒక నటి లేక ఒక నటుడుకోసం కథని మలుచుకుపోతే అందులోని కృత్రిమత్వాన్ని ప్రజలు ఇట్టే పసిగట్టేస్తారు. అలా కాకుండా కథలో ప్రాముఖ్యతనిబట్టి పాత్ర ఆధిక్యత పెరిగితే అది ఎంతో సహజంగా వుంటుంది, దానికి ప్రజల ఆదరణా లభిస్తుంది. ఇలాంటి అభిమానానికి పాత్రురాలయ్యేదే పూర్ణా ఆర్ట్ పిక్చర్స్ వారి 'మాతృదేవత.'

సావిత్రి దర్శకత్వంలో తయారయిన చక్కని కుటుంబ చిత్రమిది. సుఖ దుఃఖ సమ్మిళితమయిన ఒక కుటుంబ కథని మనోహరంగా దిద్ది తీశారామె. చలన చిత్రంతో చూస్తున్నట్టు కాకుండా, మన నిత్య జీవితంలో తటస్థపడే కొన్ని కుటుంబాల చరిత్రని కళ్లారా చూస్తున్నట్టే అనిపింపజేశాయి కొన్ని కొన్ని సన్నివేశాలు. చిత్రీకరణలో ఈ విధమైన నేర్పు శ్రీమతి సావిత్రిని దర్శకురాలిగా చేసింది. ఇలాంటి చిత్రాలకి ఆమె తగిన దర్శకురాలని ఈ చిత్రం నిరూపించింది.

రక్తికట్టించే కథ కన్నా సంసారం దిద్దుబాట్లను గురించిన కొన్ని సన్నివేశాలు స్త్రీలను బాగా ఆకర్షిస్తాయి. ఇందులో మాతృదేవత లక్ష్మి? శాంతమ్మా?. అనే మాటటుంచి — కథ జోలికివస్తే — శ్రీనివాసరావు అనివార్య కారణాలవల్ల యిల్లు విడిచిపెట్టి వెళ్లవలసి వస్తుంది. అతను చచ్చిపోయినట్టు భార్య లక్ష్మికి తెలుస్తుంది. ఆమె విధవ అవుతుంది. కథకి ఇది మొదటి ట్విస్టు. తర్వాత ఆ కుటుంబం హైదరాబాదు వెళ్తుంది. అక్కడ పోలీసు ధర్మయ్య ఆదరంతో నిలదొక్కుకో గల్గుతారు. తర్వాత కొంత కాలానికి శ్రీనివాసరావు కనిపిస్తాడు. ఆ తర్వాత లక్ష్మి గర్భవతి అవుతుంది. ఇది కథకి బలమైన మరో మెలిక. పూరుపూరంతా కట్టగట్టి ఆమె చేసిన నేరాన్ని వేలెత్తి చూపిస్తూ యింటి మీద దాడిచేస్తారు. (హైదరాబాదుసిటీలో?) నిజం నిలకడమీద తెలిసి కథ కంచికి వెళ్తుంది.

ఈ కథని ప్రజలు మెచ్చే విధంగా ఇంతకుముందు వచ్చిన చిత్రాలకన్నా కొత్తదనంతో చిత్రీకరించాలంటే అది దుస్సాధ్యమైన పని. ఆ కార్యాన్ని సాధించడంద్వారానే సావిత్రి కృతకృత్యురాలు కాగల్గారు. ఆమె ముఖ్యపాత్రని ధరించడంద్వారా కథకి పటుత్వమూ చిత్రానికి శోభ వచ్చాయి. లక్ష్మి పాత్రలో ఆమె నిండయిన నటన కనబర్చారు. యన్. టి. రామారావు పాత్ర చిన్నదయినా కథకి ప్రాణం పోసింది ఆయనే అని చెప్పాలి. కథకి తగినపాళ్లలో హాస్యం అందించినందుకు రేలంగి, రాజ్‌బాబు, నాగభూషణం అభినందనీయులు. చాకచక్యంగా నటించి ప్రేక్షకులకు ఉత్సాహాన్నిచ్చిన వారు శోభన్‌బాబు, చంద్రకళ. మిగతా ముఖ్య పాత్రలని హేమలత, ప్రభాకరరెడ్డి, విజయలలిత మొదలైనవారు పోషించారు.

ముఖ్యంగా చెప్పుకోతగింది సంగీతం. మహదేవన్ సంగీతంలో పాటలన్నీ మధురంగా వినిపించాయి. దాశరథి పాట 'మనసే కోవెలగా' బాగా అలరిస్తుంది.

కె. ప్రత్యగాత్మ స్క్రీన్‌ప్లేకి మద్దిపట్ల సూరి సంభాషణలు రాశారు. ఛాయ శేఖర్ అండ్ సింగ్ నిర్వహించారు. సకుటుంబంగా చూసి ఆనందించ తగ్గ 'మాతృదేవత' నిర్మాతలు బి. పూర్ణచంద్రరావు, ఎం. చంద్రశేఖర్.

—నీరజారాజు

# సినిమా

మద్రాసులో విపరీతమైన వర్షం కురుస్తూండడంవల్ల మిత్రా ప్రొడక్షన్స్‌వారు 'మళ్ళీ పెళ్ళి' చిత్రంలో విజయనిర్మల, కృష్ణ పాడే డ్యూయెట్‌పాటను తిరువనంతపురంకు వెళ్ళి అక్కడ చిత్రీకరించారు. ఈ చిత్రానికి శ్రీ పి. ఎస్. రావ్ దర్శకుడు.

* * *

యువ కళాదర్శకుడు కొరటాల నరసింహారావు కడుపులో అల్సర్ మూలంగా 18—10—69 రాత్రి పదిన్నరగంటలకు మద్రాసు జనరల్ ఆస్పత్రిలో కన్ను మూసారు. వీరు 'గులేబకావళి కథ'కు కళా దర్శకునిగా పనిచేసారు. తర్వాత ప్రముఖ ఆర్టు డైరెక్టరు శ్రీ గోఖలేకు సహాయకుడిగా వాళ్ళయిదు చిత్రాలకు పనిచేశారు. చనిపోయేనాటికి అజంతా మూవీస్ 'మెరుపు వీరుడు' చిత్రానికి వీరు కళాదర్శకునిగా వున్నారు. వీరి వయస్సు 32 సంవత్సరాలు.

* * *

పట్టుపరుపులపై శ్రీమతి దేవిక వయ్యారంగా పడుకుని ప్రశాంతంగా నిదుర పోతూంది. ఆమె తల్పాన్ని శ్రీ ఎన్. టి. రామారావు సమీపించారు. నిదురపోతున్న ఆమె ముఖారవిందాన్ని తనివితీరా చూచి, ఆమె రూపురేఖా విలాసాలకు శ్రీ రామారావు తన్మయులయ్యారు. ఆమె అందచందాలను వర్ణిస్తూ, శయ్యపైనున్న దేవిక చెంపకు తనచెంపను ఆన్చి, ఆనందాతిశయంతో ఆమెను తనలో యిముడ్చుకోవా లనుకున్న సమయంచూచి 'కట్' అన్నారు దర్శకుడు శ్రీ వీరలాచార్య. ఈ శృంగార సన్నివేశం కె. జి. ఆర్. ప్రొడక్షన్స్‌వారి జానపదంలో కనిపిస్తుంది.



"మాతృదేవత"లో చంద్రకళ.



"లక్ష్మీకటాక్షం"లో ఎన్. టి. రామారావు, కె. ఆర్. విజయ.

ఈ సంస్థను శ్రీయుతులు ఎం. కె. గంగరాజు, వెంకటేశ్వర్లు కలసి స్థాపించారు. ఈ చిత్రానికి చిల్లర భావనారాయణ మాటలను, విజయా కృష్ణమూర్తి మ్యూజిక్‌ను సమకూరుస్తున్నారు. ఈ చిత్రంలోని ముఖ్యభూమికలను శ్రీయుతులు ఎన్. టి. రామారావు, దేవిక, సత్యనారాయణ, విజయలలిత ధరిస్తారు.

* * *

ఫల్గుణా ప్రొడక్షన్స్‌వారు తమ క్రైమ్‌థ్రిల్లర్ చిత్రీకరణ డిసెంబరులో ప్రారంభిస్తారు. శ్రీ విజయ బాపినీడు రాసిన కథకి శ్రీ పినిశెట్టి సంభాషణలని సమకూర్చారు.

చిత్రంలోని ముఖ్యపాత్రలకు ఎస్. వి. రంగారావు, గుమ్మడి, శోభన్ బాబు, వాణిశ్రీ, రాజ్ బాబు, విజయలలిత, చంద్రమోహన్‌లని యింతవరకూ ఎన్నిక చేయడం జరిగింది. కళా దర్శకత్వాన్ని శ్రీ సూరన్న, సంగీతాన్ని శ్రీ కోదండపాణి, కెమేరాని శ్రీ కన్నప్ప, దర్శకత్వాన్ని శ్రీ కె. వి.

"ఎంతరుచి
దీనికిటుకు ఏమిటో?"

"మిల్క్‌మేడ్! ఎంతో
అనుకూలంగా వుంటుంది.
పాలు పంచదారకలిపే
వుంటాయికాబట్టి!"

# మధుపూరితమైన పాలు -అది మిల్క్‌మేడ్

ఇది అచ్ఛమైన పూర్తి మీగడపాలు శుద్ధిచేయబడిన పంచదార శ్రమలేకుండా వెంటనే వుపయోగించుకోడానికి తయారుచేసిన మేళవింపు. నెస్లేవారి మిల్క్‌మేడ్ మీరు తయారుచేసుకొనే ఖీరు, బర్ఫీ, బూరెలు మొదలైన తీయని తినుబండారాలకు ఎక్కువ రుచిని కమ్మదనాన్ని ఇస్తుంది. మిల్క్‌మేడ్ A, D, విటమినులతో సంపన్నంగా వుండటంచేత మీ ఎదుగుతూన్న పిల్లలకు సాధారణ పాలకంటె ఆరోగ్యకరము.

ఒక మిల్క్‌మేడ్‌కు 2 వంతుల నీళ్లు కలిపి 1 లిటరు తియ్యని పాలు తయారుచేసుకోండి.

ఎంత భాగ్యము! ఎంత సులభము!

**మీ పంచదార పాల సమస్యలకు పరిష్కారమే మిల్క్ మేడ్**




'మిల్క్‌మేడ్' నెస్లేవారు మొట్టమొదట సృష్టించిన గడ్డపాలకు రిజిష్టర్డ్ ట్రేడ్‌మార్కు

NPI-5356



"అఖండుడు"లో గీతాంజలి, ప్రభాకరరెడ్డి

వందనరావు నిర్వహిస్తారు. నిర్మాతలు శ్రీ పి. విక్రమేశ్వరరావు, శ్రీ రాఘవ.

* * *

బి. యస్. మూవీస్‌వారు నిర్మిస్తున్న సాంఘిక చిత్రానికి 'పచ్చని సంసారం' అని పేరు పెట్టారు. ఇటీవల కథానాయకుని (కృష్ణ) ఇంటి సెట్టుపైన మూడు వారాలపాటు నిర్విరామంగా షూటింగ్ జరిగింది. ఈ షెడ్యూల్‌లో ముఖ్య సన్నివేశాలతోపాటు రెండు పాటలుకూడా చిత్రీకరించారు. దాశరథి రచించిన ఆ రెండు గీతాలలోను ఒకటి 'అమ్మా, నీవులేని తావే లేదూ' అనేది సుశీల పాడింది. ఈ ప్రార్థన

## సినిమా

గీతాన్ని కథానాయకి వాణిశ్రీమీద చిత్రీకరించారు రెండవది 'పాపాయి నవ్వులే' అనేది. ఘంటసాల పాడారు. దీన్ని కృష్ణ, గుమ్మడి, వాణిశ్రీ, బేబీ డాలీమీద తీశారు. ఇతర ముఖ్య భూమికలలో కె. ఆర్. విజయ, సూర్యకాంతం, గీతాంజలి, సంధ్యారాణి, బేబీ రాణి, బేబీ శ్రీదేవి, పద్మనాభం, రాజబాబు. రామకృష్ణ, పెరుమాళ్ళు, ధూళిపాళ, మిక్కిలినేని, రమణారెడ్డి ఉన్నారు. రేలంగి, నాగభూషణం అతిథి నటులు.

## సినిమా డైరీ

● శ్రీ ప్రొడక్షన్స్ "పెళ్ళికూతురు" షూటింగు నవంబరు ఒకటి నుండి వాహినిలో ప్రారంభమైంది ఈ చిత్రానికి శ్రీ వి. రామచంద్రరావు దర్శకుడు.

● జోతిసినీ సిండికేటు "పెత్తందార్లు" గోల్డెన్‌లో శ్రీ సి. ఎస్. రావు దర్శకత్వంలో గత పదిహేను రోజులుగా షూటింగు జరుపుకున్నది. శ్రీ ఎన్. టి రామారావు, శోభన్‌బాబు, నాగభూషణం, అల్లురామలింగయ్య, సావిత్రి, విజయనిర్మల, రావుగోపాలరావు, ధూళిపాళ, ముక్కామల, సంధ్యారాణి మొదలగువారు పాల్గొన్నారు.

● "బందిపోటు భీమన్న" అవుట్‌డోర్ షూటింగు శ్రీశైలం వద్ద గత పదిరోజులుగా జరుపుకుని నవంబరు ఒకటికి మద్రాసు చేరుకుంది. కృష్ణ, ఎస్వీరంగారావు, విజయనిర్మల, రాజ్‌బాబు, మీనాకుమారి, పహిల్వాన్ కాంతారావు, జగ్గారావు పాల్గొన్న దృశ్యాలను శ్రీ మల్లికార్జునరావు చిత్రీకరించారు.

● శ్రీ రామకృష్ణా పిక్చర్స్ "తారాశశాంకము" పూర్ణాపిక్చర్స్ ద్వారా నవంబరు 20వ విడుదల అవుతుంది. శ్రీ అప్పారావు [మానాపురం] దర్శకత్వం నిర్వహించిన యీ పౌరాణిక చిత్రం శ్రీ సత్యనారాయణచే నిర్మించబడింది

నటుడు శ్రీ ఎం. ప్రభాకరరెడ్డి కథ సమకూర్చిన యీ చిత్రానికి మద్దిపట్ల సూరి సంభాషణలు రాశారు. పాటలు: సి. నారాయణరెడ్డి, దాశరథి, కొసరాజు, గోపి, సంగీతం: కోదండపాణి, కళ: అనంతరావ్. కెమెరా: యస్. వెంకటరత్నం, కూర్పు: కె. ఏ. మార్తాండ్, సహాయ దర్శకులు: బి కృష్ణారావు, ఉపేంద్రరెడ్డి, అసోసియేట్ డైరెక్టర్: క్రిష్ణకిషోర్, స్క్రీన్‌ప్లే, దర్శకత్వం: పి లక్ష్మీదీపక్, నిర్మాత: బి. నారాయణ. ఆంధ్రప్రదేశ్‌లో యీ చిత్రం లక్ష్మీఫిలింస్‌ద్వారా విడుదల అవుతుంది.

* * *

ఒక తల్లి కడుపున ఒకే రక్తాన్ని పంచుకు పుట్టిన అక్కాచెల్లెళ్ల జీవిత గమనాన్ని, వారి జీవిత లక్ష్యాన్ని చాటి చెప్పే చక్కటి చిత్రమే జగపతి ఫిలింస్ వారి మొదటి ప్రయత్నం.

'తల్లి తండ్రిలేని లోటును తీర్చిన అక్కయ్య, ఆ అక్కయ్య సుఖమే తన సర్వస్వము అని భావించిన చెల్లెమ్మల పవిత్ర ప్రేమయే 'అక్కా చెల్లెలు'. అక్కయ్యగా షావుకారు జానకి, జడ్జిగా నాగేశ్వరరావు ప్లీడరుగా కృష్ణ, యితర ప్రధాన పాత్రలను శ్రీయుతులు పద్మనాభం, గుమ్మడి, శాంతకుమారి, విజయలలిత, సూర్యకాంతం, రమాప్రభలు పోషించారు.

శ్రీ వి కృష్ణప్రసాద్ నిర్మించిన ఈ చిత్రం లక్ష్మీఫిలింస్ ద్వారా విడుదలవుతుంది. ఈ చిత్రానికి మాటలను శ్రీ ఆత్రేయ, సంగీతాన్ని మహదేవన్, ఛాయను: వెంకటరత్నం, ఆర్టు ను: జి. వి. సుబ్బారావు, కూర్పును: సంజీవిగారున్నూ నిర్వహించారు సారథి (హైదరాబాదు) స్టుడియోలో నిర్మితమయిన ఈ చిత్రాన్ని శ్రీ ఎం. సంజీవి డైరెక్టు చేశారు.

* * *

ఒక తల్లికడుపున కవలలు పుడతారు ఇద్దరూ అప్రయోజకులయ్యారు. ఆమె తన నోము ఫలించి పండులాంటి యిద్దరు మొగరాయుళ్ళు పుట్టారుగదా అని సంబర పడడం భగవంతుడు ఓర్వలేదనుకుంటా. ఒకడ్ని తల్లినుండి విడదిసాడు. మరొకడ్ని పనికిమాలిన చవటను చేసాడు. పాపం ఆ తల్లి తల్లడిల్లిపోయింది. ఆమె తన తల

# మద్యనిషేధం రద్దు...
# సినీప్రముఖుల అభిప్రాయాలు

మద్యపాన నిషేధం రద్దు అయినందువల్ల చిత్రాలకేమయినా యిబ్బంది కల్గుతుందా? అన్నప్రశ్నపై మన చలనచిత్ర పరిశ్రమలోని ప్రముఖులు ఇచ్చిన అభిప్రాయాలు:

**చిత్రపరిశ్రమకి గొడ్డలిపెట్టు...**

**డి.వి.ఎస్. నిర్మాత డి.వి.ఎస్. రాజు.**



దీనివల్ల మన చిత్రాల వసూళ్లలో చాలా తేడా కనిపించి తీరుతుంది. సాయంకాలం ఫ్రాటుసినిమాలకు వచ్చే వాళ్లలో కొంతమందయినా మందుకొట్టుకుపోవడం ఖాయం. కాబట్టి మద్యపాన నిషేధంరద్దుకావడం చిత్రపరిశ్రమకు గొడ్డలి పెట్టు అని చెప్పకతప్పదు.

**ఆ రోజుల్లో... ఈ రోజుల్లో...**

**జగపతి అధినేత రాజేంద్రప్రసాద్:**



'పొగ త్రాగనివాడు దున్నపోతై పుట్టున్ అన్నారు ఆ రోజుల్లో.' మద్యపానము చేయనివాడు పశువై పుట్టున్ అంటున్నారు ఈ రోజుల్లో. పూర్వం కొంచెం మత్తు పదార్థం సేవించి సినిమాకొస్తే నలుగురిలో నవ్వుల పాలవుతామేమో నన్న బాధ, ప్రభుత్వానికి పట్టుబడతామేమోనన్న భయంతో కొంతవరకు జడిసేవారు ఇప్పుడు త్రాగనివారు, త్రాగినవారు వచ్చి మరింత ఆనందంగా సినిమాలు చూస్తారు. దీనివల్ల నష్టం కలిగేది సినిమావారికన్నా మద్యపానం చట్టం ముసుగుగా పెట్టుకుని మాముగుడబ్బులు సంపాయించే మధ్యవారికే. మనం మంచి చిత్రాలంటూ తీయకలిగినంత కాలం ఈ పరిశ్రమ పురోభివృద్ధిని ఎవరూ ఏవిధంగానూ ఆపలేరు.

**కొత్త మోజులో తగ్గినా...**

**నటుడు కృష్ణ.**



హైద్రాబాదులో మద్యపానం జరుగుతూనే వుందిగా అక్కడ చిత్రాలకు కలెక్షన్లు వస్తున్నాయిగా కొత్త మోజులో వసూళ్లు కాస్త తగ్గినా క్రమేణా మన చిత్రాలకు వచ్చే డబ్బు తనంతట తానే వచ్చి తీరుతుంది.

**ప్రారంభంలో నిరాశ...**

**నటుడు గుమ్మడి:**



'మద్యపాన నిషేధంరద్దు "వద్దు" అంటే ఆపగలమా? సినిమాలకువచ్చే వాళ్ల సంఖ్య తగ్గేందుకు ఆస్కారం లేదు. ప్రారంభంలో వసూళ్లలో కొంత నిరాశ కనిపించినా తర్వాత సరవుతుంది.

## సినివార్త

ప్రాతను తనే పోషించుకుంటుంది. ఇది అలాగే కొనసాగిందా? లేక ఆమె జీవితంలో 'మంచి రోజు' వచ్చిందా? అన్న కథాంశంగల చిత్రమే అజంతా మూవీస్‌వారి 'మెరుపు వీరుడు'. తల్లిగా శ్రీమతి పుష్పకుమారి, యిద్దరు కొడుకులుగా శ్రీ టి. ఎల్. కాంతారావు. ఈ చిత్రాన్ని శ్రీయుతులు కృష్ణమూర్తి, సుహేంద్ర నిర్మిస్తున్నారు.



"వధ్యనిచంపారం"లో వాణిశ్రీ.

దర్శకత్వాన్ని ఎడిటింగులో అనుభవజ్ఞుడయిన శ్రీ హరినారాయణ నిర్వహిస్తున్నాడు. సంగీతాన్ని శ్రీ ఘంటసాల, ఛాయను శ్రీ థామస్ చేపట్టిన ఈ జానపద చిత్రంలోని యితర ముఖ్యపాత్రలను రాజనాల, ధూళిపాళ, రాజబాబు, ప్రభాకరరెడ్డి, కాకరాల, గణేష్, రాజశ్రీ, లక్ష్మీశ్యామల ధరిస్తున్నారు. చిత్రంయొక్క



# ఈ వరిని సీబా కీటకనాశనితో కాపాడుకోండి



## డిమెక్రాన్ 100

పేల్చు, తొలుచు పురుగుల నరికట్టుటకు ఫాస్ఫోమిడాన్ ఆధారమైన, నీటిలో కరుగు దైహిక క్రిమిసంహారి.

## నువాన్ 100 ఇసి

పేల్చు, నములు, త్రవ్వు పురుగులను అరికట్టుటకు అధిక శక్తిగల క్రిమి సంహారి, పురుగునకు తగిలినా, కడుపులోనికి పోయినా, పొగ పీల్చినా విషపూరిత మైనది.

ఇంకా వివరాలు కావాలంటే సీబా ఆఫ్ ఇండియా లిమిటెడ్ పెస్టిసైడ్స్ డివిషన్ పోస్ట్ బాక్స్ 479 బొంబాయి కి వ్రాయండి.

C I B A





డిస్ట్రిబ్యూటర్లు

* శ్రీ బాలాజీ కెమికల్స్, వార్ఫ రోడ్, తాడేపల్లిగూడెం, ప.గో. జిల్లా. * మెసర్స్. టి. జి. లక్ష్మయ్య, శెట్టి & సన్స్, పోస్టుబాక్సు నెం. 28, ఆదోని. * మెసర్స్. రేకా కార్పొరేషన్ 5-9-31/1, బషీర్‌బాగ్, హైదరాబాదు-29. * మెసర్స్. క్రిషి కెమికల్ ఏజెన్సీస్, c/o, భాను ట్రేడింగ్ కంపెనీ, మెయిన్ రోడ్డు, రాజమండ్రి తూ. గో. జిల్లా.

## బిట్ క్విజ్ నెం 58 – 18 క్లూలు

1. ఏ వ్యక్తి యొక్క అధికారము/సంపన్నత అడుగంట నారంభించునో, అతడు తనకు విద్వేషపూరితులైన విమర్శకులే తప్ప మిత్రులు లేనట్లు తరచుగా గుర్తించును.

2. మనము చేయు పనులను తూచి చూచునట్టియు, మరియు కొలచునట్టియు, అనుమతించునట్టియు లేక నిరాకరించునట్టియు ఒక మౌన న్యాయ నిర్ణేత మనలో ప్రతి వారిలో నున్నాడు. ఆన్యాయనిర్ణేతను మనము మోసముతో / లంచమిచ్చి వశపరచుకొనలేము.

3. చింత/భయము ప్రజల ఆరోగ్యమును, ఆనందమును నిశ్శబ్దముగా హరించును.

4. ఇవి విరుద్ధమైన / అస్థిరమైన విలువలు గల రోజులు.

5. మనము దేనిని వాంఛించెదమో దానిని కాక దేనికి అర్హులమో/దేనిని అర్పించెదమో, దానినే మనము జీవితములో పొందెదము.

6. పని కాక, వ్యాకులత మనలను ఉత్సాహహీనునిగా/అలసిన వానినిగా జేయును.

7. విద్య / విమోచన యొక్క మహత్తర కార్యములో, ఏ వ్యక్తియు అందుబాటులో లేనివాడు కాడు.

8. ఈ ప్రపంచపు నాయకులు ఎల్లప్పుడు ఆవేశ / ఉత్సాహ పూరిత వ్యక్తులు గనే యుండిరి, మరియు ఉన్నారు.

9. మానవుని వలెనే, అనుభవము / అభివ్యక్తత ఆరంభములో బలహీనము, ప్రయోజనశూన్యమునైనను, కాలానుగతముగా పరిపక్వమును మరియు పటుత్వమును పొందును.

10. క్షమా/దయాగుణముయొక్క శీతల బిందువులచే మాత్రమే ప్రతీకారాగ్ని చల్లార్చ బడగలదు.

11. మీరు ఆరోగ్యంగా/ప్రసన్నంగా నున్నప్పుడు మాత్రమే మీ శరీరము, మీ మనస్సు, మరియు మీభావనలు సంతులితముగానుండును.

12. మనోవికారము / సినిమాల యొక్క ప్రభావమునకు మనమెంతో, పిల్లలు కూడ అంతగనే లోనగుదురు.

13. మనమందరము, ప్రేమింపబడు చున్నట్లును, మరియు, గౌరవింప/ఆకాంక్షింప బడుచున్నట్లును భావింప నపేక్షింతుము.

14. ఆధునిక కాలము వైజ్ఞానిక/సామ్యవాద ప్రవృత్తి కలిగియున్నది.

15. మనము, ఏ విషయమునైనను, దాని యందు ప్రతిభ/అభిరుచిలేనిదే, నేర్చుకొనలేము.

16. తర తరాలుగా, అధ్యాపకుల/ఆధ్యాత్మిక వేత్తల పట్ల సమాజము యొక్క వైఖరి మిక్కిలి అసంగతముగా నున్నది.

17. ప్రశాంత, సుస్థిర వదనము వెనుక భీతి/బాధ మరుగుపడి యుండగలవు.

18. తన భావన/సమయములో జీవించు మానవుడు యదార్థముగా పేదవాడే.

## No. 58: 18 CLUES

(1) A man whose Authority / Prosperity begins to slip often discovers that he has no friends only hostile critics

(2) There is a silent judge in each of us weighing and measuring our acts, approving or disapproving. We cannot Bluff Bribe this judge.

(3) Care / Fear silently robs people of good health and happiness.

(4) These are times of Conflicting/ Melting values.

(5) We get from life not what we would ask for, but what we Deserve / Donate.

(6) Not work but worry makes us Dreary / Weary.

(7) In the high task of Education / Emancipation, no man is an island

(8) The leaders of this world always have been and are men o Emotion / Enthusiasm.

(9) Like man himself, Experience/ Expression is feeble and apparently purposeless in its infancy, but acquires maturity anp strength with age.

(10) The fire of revenge can only be quenched by the cool droops of Forgiveness / Kindness.

(11) When you are Healty / Hearty, your body, your mind, and your emotions are in balance.

(12) Children are just as susceptible to the influence of Moods / Movies as we.

(13) We all like to feel that we are loved and Respected / Wanted.

(14) The modern age has a Scientific / Socialistic temper.

(15) We cannot learn anything without having a Talent / Taste for it.

(16) Through the ages, society has been highly ambivalent in its attitudes to Teachers / Thinkers.

(17) Terror / Trouble can hide behind a calm, composed face.

(18) Poor indeed is the man who lives only in his own Thought / Time.

గమనిక: పై క్లూలు ప్రసిద్ధ గ్రంథకర్తల పుస్తకములనుండి తీసుకొనబడినవి. అవి పూర్తి వాక్యములు మరియు వేరువేరుగా పూర్తి అర్థవంతమైనవి. గ్రంథకర్తలు, వారి పుస్తకముల పేర్లు అఫిషియల్ సొల్యూషన్ తో పాటు బిట్ క్విజ్ షీట్లో ప్రచురించబడును.

* బిట్ క్విజ్ షీట్లు ఉచిత కాపీ అడిగి తీసుకోండి.

## మీకు తెలుసా?

'అనుపమ' చిత్రాన్ని రష్యన్లు కొని, తమభాషలో డబ్ చేస్తున్నారట.

సినీమా నటీనటులకు వచ్చే ఉత్తరాలలో అధికమయినవి ప్రేమలేఖలు వీటికి మన తారలు ఎలా సమాధానమివ్వగలరు చెప్పండి ?

మైసూరు ప్రభుత్వం గత రెండు సంవత్సరాల కాలంలో 29 కన్నడ చిత్రాలకు సబ్సిడీ యిచ్చిందట.

హాలివుడ్ కథానాయకుల్లో ఎక్కువ ఆదాయపుపన్ను చెల్లించేనటుడు ఎల్విస్ ప్రిస్లీ అట.

'నవరాత్రి' తెలుగుచిత్రంలో శ్రీ నాగేశ్వరరావు తొమ్మిది పాత్రలను పోషించారు. తెలుగులో ఇంతవరకూ మరెవ్వరు యిన్ని భూమికలను ఒకే చిత్రంలో పోషించలేదు.

షూటింగు (దర్బారు సెట్టుమినహా) పూర్తయింది. ఎడిటింగు యెప్పటికప్పుడు సిద్ధమౌతూ వుంది. శ్రీ టి. ఎల్. కాంతారావు ప్రప్రథమంగా ద్విపాత్రాభినయం చేస్తున్న ఈ చిత్రం డిసెంబరు చివరి వారంలో పూర్ణా పిక్చర్స్ద్వారా విడుదల అవుతుంది.

* * *

పి. ఎస్. ఆర్. పిక్చర్స్ అధినేత శ్రీ పింజల సుబ్బారావు నిర్మిస్తున్న 'శ్రీకృష్ణ కటాక్షం' చిత్రానికి చిల్లర భావనారాయణ మాటలను, కోదండపాణి సంగీతాన్ని, వేలు ఛాయాగ్రహణాన్ని, నాగేశ్వరరావు కళా దర్శకత్వాన్ని నిర్వహిస్తున్నారు, శ్రీ విఠలాచార్య దర్శకత్వ చాతుర్యం ప్రతి సన్నివేశంలో మీకు కొట్టొచ్చినట్టు కనిపించి తీరుతుంది. ఈ చిత్రంలోని ప్రధాన పాత్రలను ఎన్. టి. రామారావు, కె. ఆర్. విజయ, సత్యనారాయణ, ప్రభాకరరెడ్డి, బాలయ్య, రాజశ్రీ, బాలకృష్ణ, హేమలత పోషిస్తున్నారు. ఈ చిత్రాన్ని రిలీజుచేసే బాధ్యతను రాయల్ఫిలింస్ గైకొన్నారు.

—శ్రీనివాస్

లిట్‌క్విజ్ నెం. 56 లో ఒక్కొక్కరు రూ. 10,000/- గెలుపొందిరి

(1) చేతన హౌస్. బ్లాక్, 5, స్వామి దేవేంద్ర సొసైటీ, హీరాబాగ్, అంబావాడి, అహమ్మదాబాద్–6. (2) మిస్ నిలిమ ఫోర్డ్ C/o ఎ. ఫోర్డ్, 73, బాద్‌షాహీ మండి, అహమ్మదాబాద్–3. (3) ఠాకూర్ హేమాటూ సుందర్‌లాల్, 2 వ అంతస్తు, ఫ్లాట్ నెం. 12, లాల్‌హౌస్ బిల్డింగ్, గోకాడియా లేన్, సర్దార్ వి. పి. రోడ్, బోరివలి, బొంబాయి–92.



లిట్‌క్విజ్ నెం. 58 అధికార ఎంట్రీ ఫారము

బహుమతుల మొత్తం రు. 65,000. ఆఖరు ముగింపు తేది 26-11-69 బుధవారం

ADDRESS: LITQUIZ No. 58, ALANKAR, BALARAM STREET, BOMBAY-7. (W B)

సూచిక: 1) ఒక్కొక్క కాలంలో మీరు వద్దనే పదమును కొట్టివేయండి. (2) ఒక కూపన్ మాత్రం పంపినచో ఇతర కూపనులను కొట్టివేయండి. (3) ఎంట్రీరుసుము M.O. ద్వారా పంపినచో, పోస్టాఫీసునుండిపొందిన M.O. రసీదును ఎంట్రీ ఫారమునకు జతపరచవలెను. M. O. రసీదు లేని ఎంట్రీలు నిరాకరింపబడును. (4) I. P. O. క్రాస్‌చేయావద్దు. అది లిట్‌క్విజ్ నెం. 58, బొంబాయి—7 వారికి చెల్లించునట్లు ఉండవలెను.

| | 1 | Re.1 | 2 | Re.1 | 3 | Re.1 | 4 | Re 1 | FREE | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | AUTHORITY | PROSPERITY | AUTHORITY | PROSPERITY | AUTHORITY | PROSPERITY | AUTHORITY | PROSPERITY | AUTHORITY | PROSPERITY |
| 2 | BLUFF | BRIBE | BLUFF | BRIBE | BLUFF | BRIBE | BLUFF | BRIBE | BLUFF | BRIBE |
| 3 | CARE | FEAR | CARE | FEAR | CARE | FEAR | CARE | FEAR | CARE | FEAR |
| 4 | CONFLICTING | MELTING | CONFLICTING | MELTING | CONFLICTING | MELTING | CONFLICTING | MELTING | CONFLICTING | MELTING |
| 5 | DESERVE | DONATE | DESERVE | DONATE | DESERVE | DONATE | DESERVE | DONATE | DESERVE | DONATE |
| 6 | DREARY | WEARY | DREARY | WEARY | DREARY | WEARY | DREARY | WEARY | DREARY | WEARY |
| 7 | EDUCATION | EMANCIPATION | EDUCATION | EMANCIPATION | EDUCATION | EMANCIPATION | EDUCATION | EMANCIPATION | EDUCATION | EMANCIPATION |
| 8 | EMOTION | ENTHUSIASM | EMOTION | ENTHUSIASM | EMOTION | ENTHUSIASM | EMOTION | ENTHUSIASM | EMOTION | ENTHUSIASM |
| 9 | EXPERIENCE | EXPRESSION | EXPERIENCE | EXPRESSION | EXPERIENCE | EXPRESSION | EXPERIENCE | EXPRESSION | EXPERIENCE | EXPRESSION |
| 10 | FORGIVENESS | KINDNESS | FORGIVENESS | KINDNESS | FORGIVENESS | KINDNESS | FORGIVENESS | KINDNESS | FORGIVENESS | KINDNESS |
| 11 | HEALTHY | HEARTY | HEALTHY | HEARTY | HEALTHY | HEARTY | HEALTHY | HEARTY | HEALTHY | HEARTY |
| 12 | MOODS | MOVIES | MOODS | MOVIES | MOODS | MOVIES | MOODS | MOVIES | MOODS | MOVIES |
| 13 | RESPECTED | WANTED | RESPECTED | WANTED | RESPECTED | WANTED | RESPECTED | WANTED | RESPECTED | WANTED |
| 14 | SCIENTIFIC | SOCIALISTIC | SCIENTIFIC | SOCIALISTIC | SCIENTIFIC | SOCIALISTIC | SCIENTIFIC | SOCIALISTIC | SCIENTIFIC | SOCIALISTIC |
| 15 | TALENT | TASTE | TALENT | TASTE | TALENT | TASTE | TALENT | TASTE | TALENT | TASTE |
| 16 | TEACHERS | THINKERS | TEACHERS | THINKERS | TEACHERS | THINKERS | TEACHERS | THINKERS | TEACHERS | THINKERS |
| 17 | TERROR | TROUBLE | TERROR | TROUBLE | TERROR | TROUBLE | TERROR | TROUBLE | TERROR | TROUBLE |
| 18 | THOUGHT | TIME | THOUGHT | TIME | THOUGHT | TIME | THOUGHT | TIME | THOUGHT | TIME |

ఈ క్విజ్ ప్రవేశమునకుచెందిన నిబంధనలను, షరతులను పాటించుటకు అంగీకరిస్తున్నాను. మరియు కాంపిటీషన్ ఎడిటరుగారి నిర్ణయమును తుది నిర్ణయముగాను, న్యాయబద్ధమైనదిగాను అంగీకరించుటకు ఆమోదిస్తున్నాను. ప్రతి కూపనుకు ఎంట్రీ ఫీజు రు. 1/—. ఈ పూర్తి ఎంట్రీఫారము (4 కూపనులకు) ఫీజు రు. 4/—M. O. రసీదు/I.P.O./లిట్‌క్విజ్ క్యాష్ రశీదు/క్రైజ కార్డు జతపరుస్తున్నాను. వాటి నెం.........................

58 (ASVP)

CAPITAL LETTERS

NAME..............................

..............................

ADDRESS ..............................

..............................

..............................

POST.................DIST..............

ఈ పూర్తి ఫారమును కత్తిరించిపంపవలెను

మీరు కోరిన క్రొత్త విధానము

(1) మినీక్విజ్ తొలగింపబడినది (2) గొప్ప బహుమతులు (3) లేవ కూపనులు ఉచితము

లాభ రశీదులకు మరియు ఎక్కువ ఎంట్రీఫారములకు!
Eskay Enterprises,
C/o. G. V. S. SAIKUMAR,
4 1-213, హనుమాన్ టెక్డీ, హైదరాబాద్.

ఆఖరు ముగింపు తేది: 26—11—69
సొల్యూషన్ ఆంధ్రప్రభలో : 30—11—69
* సొల్యూషన్ వెంటనే పొందుటకు 10 పై॥ స్టాంపు స్వంత అడ్రసుగల కార్డుతో వెంటనే పంపవలెను.

# పుస్తకాలు

## ఓయాసిస్

కవితా సంపుటి. శ్రీ నాగభైరవ కోటేశ్వరరావు రచన. 64 పేజీలు వెల: రూపాయిన్నర. శాంతాపబ్లికేషన్సు, బ్రాడీపేట, గుంటూరు.

## ప్రేమించు ప్రేమకై

నవల. రచయిత్రి శ్రీమతి కె. రామలక్ష్మి. ఇది వరలో ఆంధ్రసచిత్రవారపత్రికలో ప్రచురితమైన నవల. వెల. రెండురూపాయలు. ఎమ్.ఎస్.కో. ప్రచురణ. ఎం. శేషాచలంఅండ్ కో., మచిలీపట్నం.

## పుణ్యమూర్తులు

నాటకం. రచన శ్రీ గరికపాటి. పెద్దచ్చులో 128 పేజీలు. వెల మూడురూపాయలు. పబ్లిషర్సు: ఆంధ్ర రత్న బుక్‌డిపో, తెనాలి.

## శ్రీ వృషాధిప శతకము

మహాకవి పాల్కురికి సోమనాథ ప్రణీతము. డెమ్మీ 1/8 సైజు 56 పేజీలు. మూల్యం రు. 1.

## దివ్యవచనామృతం

శ్రీ శ్రీ శ్రీ పాదు పూజ్యలింగస్వాములవారి రచన. సూక్తులా స్తుతులా కూడుకున్న ఈ చిన్నపుస్తకం చదువతగింది. ప్రకాశకులు: కాకతీయ ప్రకృతి చికిత్సాలయము, స్టేషన్ రోడ్డు, వరంగల్.

## భట్టిభారవి

పద్యకావ్యము. భారవిని గురించిన కథను మూడు ఆశ్వాసాలతో అయిదువందల పద్యాలతో మధురంగా చెప్పారు. రచయిత మధురకవి శ్రీ వెలిది సత్యనారాయణమూర్తి. 98 పేజీలు. వెల మూడు రూపాయలు. వెలిది సత్యనారాయణమూర్తి, నత్తారామేశ్వరం, వయా: పెనుమంట్ర, ప.గో. జిల్లా.

## రెండు నాటికలు

పుస్తకం పేరే రెండు నాటికలు. రచయితలు ఇద్దరు—శ్రీయుతులు కె. వీరభద్రశాస్త్రి, మురళీకృష్ణ. రైల్వేలు జాతీయఆదాయాలు, ఇది నాటకం. రెండూ శ్రావ్యంగా వుంటాయి. 84 పేజీల పుస్తకం రూపాయిన్నర. నవోదయ పబ్లికేషన్స్, ఏలూరురోడ్ విజయవాడ—2.




Edited, Printed and Published by S. Radhakrishna at the Andhra Patrika Press; 6 & 7, Thambu Chetty Street, Madras-1. Chief Editor: S. Sambhu Prasad.

Regd No. 4479 ANDHRA SACHITRA VARA PATRIKA.